# గెలీలియో

**(Life of Galileo)**






గ్రంథకర్త:

సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత

సంస్కృతాంధ్ర పండిత

**మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యము**

# గెలీలియో

( Life of Galileo )



గ్రంథకర్త
సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత
సంస్కృతాంధ్ర పండిత
**మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యము**

మూల్యము రు 1-75




సారస్వతనికేతన గౌరవ కార్యదర్శి

గ్రంథాలయ సేవకులు,

శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు



సీతమ భుజంగరావుల జ్యేష్ఠసుతుఁడు
చెలఁగు శ్రీలక్ష్మీధవుఁడు విశిష్టగుణుఁడు
వినుత విద్వత్కవీంద్రుల వెల్గుటావు
వాసికింతావు ! మా **శ్రీనివాసరావు !**

# చిన్న విన్నపము

ప్రాక్తన మానవుని మనస్సు పశుదశనువీడి జ్ఞానదశను బొందిన నాఁటినుండి యతఁడు ప్రకృతిదృశ్యములం జూచి యానందించుట, వర్ణించుట తద్రహస్యముల నెఱుంగఁ గౌతూహలాయత్తచిత్తుఁడగుట సహజసిద్ధముగ నేర్పడిన స్థితి. తొలుదొల్త నట్టి యానందమును వాగ్రూపమున గేయరూపమున వెలార్చినవారు ఋషులు, కవులు. పిదపఁ దద్రహస్యమును బరిశోధనముల వలనఁ దెలిసికొని మనకు బోధించినవారే విజ్ఞానశాస్త్రకారులు. వీరిరువురకు సన్నిహితసంబంధమున్నదని నావిశ్వాసము. కవి కావ్యజగత్తును సృష్టించి తద్ద్వారమున జ్ఞానబోధచేసి ధర్మమును నెలకొల్పి ప్రజల కానందముఁ గూర్ప సంకల్పించును. విజ్ఞానశాస్త్రజ్ఞుఁడు ప్రకృతిమర్మకర్మముల నెఱిఁగి దానిని స్వాధీనముచేసికొని నూతనసృష్టిచేసి మనుజులకుఁ గ్రొంగొత్త సౌఖ్యములఁ జేకూర్ప యత్నించును. ఇరువురి ధ్యేయము లోకానందమే.

ఎవఁడు తనస్వార్థమును దగ్గించుకొని జగచ్ఛ్రేయమునకు శ్రమించునో వాఁడుపూజనీయుఁడనుట నిర్వివాదాంశము. ఈదృష్టితో నాలోచించిన విజ్ఞాన శాస్త్రసృష్టికర్తలు గూడ మనకు పూజనీయులనుట పరమ సత్యము, త్యాగశీలురైన విజ్ఞానశాస్త్రకర్తలలో గెలీలియో యగ్రగణ్యుఁడు.

శృంగారరసపూరితమైన కావ్యములు చదువుటవలనఁ గొందఱు చెడిపోవుచున్నారనియు. మారణశాస్త్రములు సృష్టించుటవలన మానవలోకమునకు హాని గలుగుచున్నదనియుఁ గొంద ఱనవచ్చు. అంతమాత్రమున శాస్త్రములు దూష్యములనుట యవివేకము. ప్రతి విషయమునందును మంచిచెడ్డలు రెండిమిడియున్నవి. లోకమే చీఁకటివెలుఁగుల కలయిక. దీపము క్రిందఁ జీఁకటి గూడ నున్నది. ఆదివ్వెవెలుఁగున నొకఁడు పొత్తము చదువుచుండ దానితేజుసాయమున మఱియొకఁ డొక వస్తువు నునికిం గనిపెట్టి దొంగిలించుచున్నాఁడు, దాన దీపము దూష్యమా? కాదు. కావున జ్ఞానమును బెంపొందించు శాస్త్రములెల్లయు నింద్యములు గావు. వానిని సద్వినియోగము చేసికొనవలసియున్నదని మనమే గ్రహింపవలయును.

గెలీలియో సృజించిన దుర్భిణి మొదలగు వస్తువులవలన లోక మెంతయుపయోగముఁబొందుచున్నదో తజ్జ్ఞులెఱుంగుదురు. ఖగోళ సత్యజ్ఞాన విషయమున నతఁడు చేసిన పరిశోధనములు, పడిన కష్టములు ప్రజలకుఁ దెలియవలయుననియే నేసీపాత్త్రమును సులభ శైలిలోఁ బద్యకావ్యముగ రచించితి. ఇది యెక్కువమంది చదివి యర్థము చేసికొనఁ గలరని నావిశ్వాసము. నాయెఱింగినంతవఱకు విజ్ఞానశాస్త్రకారుల జీవితచరిత పద్యకావ్యముగ వ్రాసినవారు లేరు. ఇదియే మొదటి గ్రంథము.

మఱియు 'గద్యం కవీనాంనికషం వదన్తి', 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనెడి పెద్దల వాక్యము లున్నను పద్యకావ్యమున కున్న స్థిరత్వము, విలువ, యందచందములు, గానానుకూల్యము బుధుల కవగతమైయున్న విషయములే. గెలీలియోకీర్తి శాశ్వతమైనదిగాన దానికిం దగినరీతిగా నాతని చరిత చిరకాలము మనఁదగిన పద్యకావ్యముగ రచింపవలయుననియే నాకుఁ గుతూహలము గలిగినది. విజ్ఞానశాస్త్రనిర్మాతలగు నిట్టి త్యాగపురుషులు ప్రపంచమునకు మేలుచేసిన మహాత్ములలో నేరికిం దీసిపోరు. కావుననే యిట్టివారి ఛాయాచిత్రములు ప్రపంచమువంగల యన్ని దేశములందలి ప్రయోగశాలలోఁ బ్రకాశించుచున్నవి. వారి నామము విద్యార్థులుపాధ్యాయులు నిత్యముస్మరించుచునే యున్నారు. సత్యము నిత్యము జీవకళతో వెలుఁగుననుట సత్యదూరముగాదు.

అస్మదాంధ్ర మహాభ్యుదయమునఁ గల ప్రథమప్రపంచమహాసంగ్రామకథవ్రాయు సందర్భమున నీ శాస్త్రకారుల జీవితచరిత్రలు చదువుట తటస్థించినది. తద్రచనా సమయమందే యెడనెడ నీగ్రంథమును వ్రాసితి. నాటినుండి శుద్ధప్రతి వ్రాయుటకు వీలుచిక్కక చిత్తుప్రతినే యచ్చునకిచ్చితి. అత్యవసరకృత్యము లొక్కుమ్మడిఁ జేకూరుటంజేసి "ప్రూఫు" ల దిద్దుటలోఁ జక్కఁగా దృష్టినిలుపమి నొండురెండు చరణములే మాఱినవి.

"అనఘులు ప్రయోక్త లద్ది కాదనిన యంత" అను చరణమునకు బదులుగా "కాని ప్రాయోగికులు దానిఁ గాదనఁగనె" అను చరణము గ్రహింపఁబడినది. "అంతుదెలియ నతని యబ్బవశమ" అనుటకు బదులు "అంతుదెలియ నతని కలవియగున" యని యుండవలయు. అచ్చుతప్పులు ద్వితీయముద్రణమున సవరింపఁబడు.

— గ్రంథకర్త.

# గెలీలియో

## ఇటలీ వర్ణన

శ్రీరంజిల్ల మహోన్నతాశయ కళాశ్రీ దివ్యదీవ్యద్ద్యుతుల్
సారాచార విచారమార్గగతికిన్ సౌఖ్యంబు చేకూర్పఁగాఁ
బారావార గభీర భావవిలసత్ప్రఖ్యాత కృత్యచ్ఛటా
ధీరానీకముతోడ నొప్పు నిటలీదేశం బసామాన్యమై.

సీ॥ ఇట హిమాలయపంక్తి యింపెసలారంగ
'నాలప్సు' గిరులట నలరుచుండు
నిచట గంగానది యెంతొ సహకరింప
నచ్చట 'పో' నది యాదరించుఁ
గమనీయమైన గంగాసింధుమైదాన
మిట నట 'లంబార్డి' యింపునింపు
నిచ్చోటఁ గలకత్త యచ్చోట 'వెన్నిసు'
పురవరవిఖ్యాతిఁ బొలుపుగులుకు

తే॥గీ॥ సింహళద్వీపమిచ్చట 'సిసిలి' యచటఁ
బాదపీఠములట్ల కన్పడుచునుండు
రెండునుం ద్వీపకల్పము లొండొకేల
భరతభూమికి నిటలికిఁ బరగుఁబోల్కిఁ.

గీ॥ దానికి న్ముఖ్యపట్టణమైన 'రోము'
సప్తపర్వతనగర ప్రశస్తిఁగాంచె
నిజపయఃపానమునఁ బెంచుఁ బ్రజలనచటఁ
*'టైబరు' నదీమతల్లి బిడ్డలనుబోలె.

కం॥ దివమార్గముఁ జూపెడి క్రై
స్తవమత పీఠాధిపతికిఁ దావరమగుటం
దివి భువి వైభవములకుఁ
భవనంబై యలరు రోము ప్రాభవశక్తిన్.

గీ॥ మతము మానవహృదయసామ్రాజ్యమందు
మూఢవిశ్వాసబీజముల్ మొలవఁజేయఁ
బాపపరిహరణార్థమై పత్రములను
గొనెడి యాచార మచ్చటఁ గొలువుదీరె.

గీ॥ తొలుత పాశ్చాత్యదేశాలఁ గల గురువులు
బల్లపఱపుగనున్న దీ యెల్లభూమి
దీని చుట్టును సూర్యుఁడే తిరుగుచుండు
నని సనాతనపుం బల్కు లాడుచుండ.

గీ॥ రాజులైనను రాజాధిరాజులైన
మతగురువుమాట కానాఁట మాఱులేదు
కాని ప్రయోగికులు దాని కా దనఁగనె
ఘోరతరశిక్షల విధించి కూల్చి రకట !

కం॥ మనబాహ్యదృష్టి కిద్దర
గనఁబడుఁ జదరముగనైన ఘనశాస్త్రజ్ఞుల్
దినదినశోధనమున గుం
డ్రనిదని పల్కం గటా యొడంబడఁ డొందుఁ.

గీ॥ ఏమి వైచిత్ర్యమోగాని యెచటనైనఁ
గడురుచించు నసత్యంబు గారణ మెదొ
యన్ని విషయంబులందు యథార్థవాది
బళిర! లోకవిరోధి యన్పలుకు నిజము.

వ॥ ప్రత్యక్షానుభవము నాధారముగఁ జేసికొని భూమి విశ్వకేంద్రమున నచంచలముగ నున్నదనియు, దానిచుట్టును జంద్రుఁడు, బుధుఁడు, శుక్రుఁడు, సూర్యుఁడు కుజుఁడు, గురుఁడు శని మొదలగు గ్రహములు ప్రదక్షిణముచేయుచున్నవనియు క్రీస్తునకుఁ బూర్వము ద్వితీయ శతాబ్దమునఁ గ్రీకు విజ్ఞాని హిపార్కస్ తెలిపెను. ప్రజలతోఁబాటు మతాధికారులు నంగీకరించి యధికారముద్ర వేసిరి. ప్రత్యక్షానుభవమునకు సిద్ధాంతఫలితములకు సమన్వయముకుదరమిఁ బ్రజ్ఞావిశేషజ్ఞులైన విజ్ఞానిశేఖరులు

గొందఱు భూకేంద్రసిద్ధాంతమును క్రమక్రమముగా మార్పఁజూచిరి. వారిలో అరిస్టార్కస్ అత్యంత ముఖ్యుఁడు. అతఁడు భూమి సూర్యుని చుట్టు తిరుగుచున్న దని మొట్టమొదటఁ జెప్పఁగలిగెను. క్రైస్తవ మతాధికారులు భూకేంద్రసిద్ధాంతము తప్పనినవారిని మతద్రోహులుగ భావించుచుండిరి. అక్కాలమున మతాధికారుల కున్న గౌరవము మఱి యేరికిం గానరాదు. అట్టియధికారులలో నత్యున్నతాధికారి పోపు. ఆపోపునివసించు దేశమగుటచే దాని గొప్పదనము వేఱ చెప్ప నక్కఱలేదు.

వ॥ 'పోపు' నాజ్ఞలేక భూపుఁడైననుగాని
పెండ్లియాడుటచట వీలుగాదు
వేయునేల యిటలి పీఠాధిపతి మాట
తిరుగు లేని కత్తి యరుల మిత్తి.

ఆ॥వె॥ గోత్రాధీశుల చరితలు
పాత్రములై వినుట కవనిఁ బ్రాకెం బెలుచన్
క్షాత్రము గల్గిన జాతిగ
ధాత్రిం బ్రఖ్యాతి వడసెఁ దజ్జన మొకచో.

గీ భువన విఖ్యాతిఁ గాంచిన పుణ్యతముఁడు
షేక్సుపియరు మహాకవి చెలువు గులుక
నిజకథానాయకులుగ రాణింపఁజేసె
నైటలేయులఁ బెక్కండ్ర నద్భుతముగ.

గీ॥ ఆసియాఖండమునఁ దిర్గి యందుఁ గలుగు
కొన్నిటిందొల్తఁ జరితకుఁ గూర్చినట్టి
మహితధీశాలి జయశీలి 'మార్కొపోలొ'
హితగుణవిభాసి యాతఁడ యిటలి వాసి.

కం॥ ఘనుఁడు విమర్శకుఁ డుత్తమ
జనవంద్యుఁడు డాన్టి యిటలి జనియించియు తా
మనమలరఁగ 'ఇన్ఫెర్నొ'
యను గ్రంథము వ్రాసె జ్ఞాను లతని నుతింపన్.

వ॥ శిశిరో వంటి మహావక్త, జూలియస్‌సీజరు వంటి ప్రపంచ విజేత, బ్రూటస్ వంటి మహాయోధుఁ,డాన్టొని క్లియోపాత్రల వంటి శృంగారరసప్రధానజీవితముగల రాజదంపతులు, హొరియొలేనసు వంటి మాతృవాక్య పరిపాలకుఁడు,మజినీ వంటి చిత్రకళాకారుఁడు డాన్టి వంటి విమర్శకుఁడు జన్మించిన దేశమది. అచటి జను లార్య జాతికి సంబంధించినవారు. శ్వేతవర్ణులు. చక్కనివారు. వారికి మతైకదృష్టి మెండు. ఒకప్పు డాదేశము పాశ్చాత్య దేశముల కాదర్శప్రాయముగ నలరారె. క్రైస్తవ లోకమునకుఁ బవిత్ర స్థలమైన రోము దానికొక యలంకారము.

## బాల్యము - విద్యాభ్యాసము

కం॥ అట్టి యిటలిఁ బైసా యను
పట్టణమున 'విన్సిజో' శుభస్థితి నలరెన్
దిట్టయయి గానవిద్యం
గట్టిగ గణితమున నతఁడు ఖ్యాతి వహించెన్.

వ॥ మానవాభ్యుదయమార్గాన్వేషణాసక్తుఁడు, స్వాతంత్ర్యాభిలాషి, విజ్ఞానార్జనాయత్తచిత్తుఁడు, గంభీరభావోపేతుఁ, డుదారహృద యుఁడు, కార్యదీక్షాపరుఁ డని యక్కాలంబునఁ బ్రజ లాతనిం గూర్చి చెప్పుకొనుట పరిపాటి. క్రైస్తవ మతద్వేష మతని కణు మాత్రమైన లేదుగాని తన్మతాధికారు లనవసరముగ శాస్త్ర పరిశోధనాది విషయములందు జోక్యము గలిగించుకొని విజ్ఞాన శాస్త్రజ్ఞులను హింసించుట యతని మనస్సున కత్యంత బాధాకర ముగనుండె. తచ్ఛాస్త్రవేత్త లొకరి భయభక్తులకు లోనుగాక స్వేచ్ఛానందకందళితహృదయారవిందులగుచు విజ్ఞాన సత్యాన్వే షణ జరుపవలయునని వాని దృఢసంకల్పము. శతసహస్రవర్ష ములనుండి వంశపరంపరగా బోధింపఁ బడుచున్న విషయమైనను దనయాత్మయందుఁ జర్చించుకొని నిగ్గు దేల్చుకొనక గ్రుడ్డిగ నమ్మరాదని యాతని ప్రత్యయము. నిరాధార రచనల విశ్వసింప

రాదనియు, నేదే నొక విషయ మాధారముగ నిరంకుశాధికార సుస్థిరత్వమునకై యొనర్చు దుష్కృత్యముల నరికట్టవలయుననియు నాధీరుని యాశయము. ప్రతి మనుజుండు లౌకిక గూఢార్థ వివేచనా శక్తి యలవఱుచుకొనవలయునని యానుజనవరేణ్యుని వాంఛ. ఇట్టి గుణగణంబులతో నతండు సన్మార్గగామియై గైలియా అమానటే యను గృహిణితోఁ గూడి గార్హస్థ్యంబు నెరవుచుండ దైవానుగ్రహంబున నొక పుత్రుండు పుట్టి శుక్లపక్షచంద్రుని వలె దినదినాభివృద్ధి నందుచుండె. అబ్బాలుని సహజసౌందర్య మనన్య సామాన్యము, వర్ణనాతీతము.

ఉ॥ అంచిత ధీరలక్షణ సమన్విత మాముఖ మావిశాలనే
త్రాంచలదీర్ఘదృష్టి పరమాద్భుతవిశ్వరహస్యభేదనో
దంచిత మాసువర్ణఫలకాలిక మక్షయయోచనాంక మా
కాంచనగర్భు వంశమున గల్గె నొకో యతఁ డీవసుంధరన్.

ఉ॥ చిన్నతనంబునం దతఁడు చేసిన పిల్లల యాటబొమ్మలం
గన్న తుటారు లాతని నెగాదిగఁజూచుచు వ్రేలెఁడంత లేఁ
డన్న! యిదేమి తెల్వియని యచ్చెరువంది తలంచి రింకముం
దెన్ని పను ల్వొనర్చి తగ నెంతయుఁ బేరు గడించు నంచెదన్.

(సంస్కృతపదరహితము)

కం॥ ఊరుండు తీరు గోడలు
నోరార వచించు నంచు నుడివిన వాక్యం
బౌరా! యిట నది సార్థక
మౌరయు శాస్త్రజ్ఞు లెంత యనుభవపరులో.

వ॥ మానవుని మనస్సు మీఁదఁ బరిసరపరిభావ మత్యద్భుతముగఁ బని సేయుననుట సర్వలోక విదితము. గెలీలియో విజ్ఞాన పరిమళ మిళితమైన కుటుంబమున జన్మించినవాఁ డగుటచేతను, పైతృక మైన ధీరలక్షణంబు లతనియందు ద్యోతకమగుచుండుటచేతను జనకుం డతని బాల్యక్రీడలం బరికించుచుఁ బూవు పుట్టగనే తావి గొల్పు నన్న సామెత వృథ కాదని తలంచుచు.

గీ కొడుకుఁగుఱ్ఱని పలుకులకుం భ్రమించి
యతఁడు పలుమాఱు లేదియో యడుగుచుండు
నడుగ నిచ్చు జవాబెంతొ నమరియుంట
నాత్మలోఁ దండ్రి మిక్కలి యలరుచుండు.

వ॥ విన్సెంజో సంగీతవిద్వాంసుఁడు గానఁ గుమారునకు వేణువీణా వాద్యవిద్యల స్వయముగ నేర్పెను. వాని వలనఁ గడుపు నిండ దని యతఁడు స్వానుభవమున గ్రహించెను. అతఁడు సద్వంశ సంజాతుఁడయ్యు నిఱుపేద. తెక్కాడిన డొక్కాడును. కావున ధనసంపాదనము ముఖ్యమని గ్రహించి పుత్రుని వస్త్ర వ్యాపారము చేయుమని నెంతయుం బ్రోత్సహించెను. గెలిలియో మనస్సు న కది యెక్కలేదు. చిత్రలేఖన కవిత్వాదులపై నతని హృదయము పనిచేయుచున్నది. చెడిన మరల బాగుచేయుట యన్న మిక్కిలి యిష్టము. ఈ విధముగా వృత్తివిషయమునఁ దండ్రి కొడుకుల యభిప్రాయములు భేదించినవి. ఒకరిదృష్టి ధనార్జనపై మఱియొకరి దృష్టిజ్ఞానార్జనపైఁ బనిచేయుచున్నది. ఐననుగుమారుని మనస్సు దేనిపైఁ బ్రసరించుచున్నదో గ్రహించుట యుత్తమ జనకుని లక్షణము.

గీ॥ ఆత్మజుని బుద్ధి వైఖరి నరసి తండ్రి
కడకు విజ్ఞానశాస్త్రమే కఱచునేమొ
యనెడి భీతి మనంబున నణఁగి యుండఁ
బలుతెఱంగుల మది బాధపడుచునుండె.

గీ॥ ఔర! యెంతకు లేరు మతాధికారు
లేనుగనుచుండ విజ్ఞాను లెంతమంది
వారి శిక్షలఁ గూలిరో పలుక వశమె
యంచు సుతుగతి యేమౌనొ యని కృశించు.

కం॥ సుధ నానఁ బోవ విసమే
యొదవిన యటు శాస్త్రదృష్టి నుజ్వల మతియై
మదిఁ గల సత్యముఁ బలికిన
నధికారుల కోపవహ్ని కాహుతి యగునో.

వ॥ అని కుమారుని విద్యావిజ్ఞానములఁ గూర్చి పలువిధములఁ జింతిం చుచుఁ గడకేమియుఁ దోఁచక యొకనిర్ణయమునకు రాఁజాలక కాలగతుల గమనించుచుండె ఆలోచింప విజ్ఞానశాస్త్రవిషయ మటుండ నీఁక.

గీ॥ గణితసాస్త్రమునందు దిగ్గంతు లకట!
దుర్భరదరిద్రబాధతో దుఃఖపడుచుఁ
గడుపు చేఁబూని యూరూరఁ గడపుచుండ
నదియు సుతునకుఁ దగదని యాత్మఁ దలఁచె.

గీ॥ ఆతఁడు గణితమునను దిట్టయైననేమి
పొట్టకుం బట్టకుం జాలనట్టులుంట
నట్టివిద్య యనర్థంబు పట్టి కనుచు
నిర్ణయమునకు వచ్చె నిర్ణిద్రబుద్ధి.

వ॥ అనంతరంబ

గీ॥ లలితకళలందు మధురమౌ లక్షణంబు
కుదురునటుగ నేర్పింపఁగూర్మి గలిగి
చక్కఁ గొడుకుమనస్సు శాస్త్రములనుండి
కళలమీఁదికిఁ ద్రిప్పఁగాఁ గాంక్ష యొదవె.

వ॥ తత్క్షణంబ నిజసత్సంకల్పసిద్ధికనువైన 'వెలమ్‌బ్రోజో'యను పాఠ శాలం గుమారుం జేర్చి తద్గురువర్యుల నుచితరీతిం బరిచయము సేసికొని తనూజునకు హితబోధసేసి యతండెంతయుఁదృప్తినందె. అంత గెలీలియో యమిత శ్రద్ధాభక్తులతో విద్యాభ్యాసము చేయుచుండె.

గీ॥ ఆతఁడు విద్యార్థిదశయందె యద్భుతముగ
గ్రీకు లాటిను భాషలఁ బ్రీతినేర్చి
లలితకళల యశశ్శ్రీవిలాసుఁడగుటఁ
దండ్రిగని వర్తకము దింపు తలఁపు మానె.

గీ॥ అప్పు డాచార్యుఁ డాతని యద్వితీయ
ధీవిశేషంబునకు మెచ్చి జీవనసుఖ
మొప్పఁ జేర్పింపుమిఁక మతోద్యోగమందుఁ
కొడుకు ననిచెప్పెఁ దండ్రికిఁ గుతుక మెసఁగ.

కం॥ మతపాఠశాలఁ జేర్చుట
మతి కళలకుఁ ద్రిప్పఁ గాని-మతబోధలతో
బ్రతుకుటకని యెంచమి నిజ
సుతునకు నది గూడదంచు సుస్థిరమతియై.

వ॥ విన్సెన్జో దీర్ఘాలోచనాయత్తచిత్తుండై తత్కాలోచిత మార్గంబులు పెక్కు చర్చించుకొని తనూభవ భవిష్యజ్జీవయాత్రా సౌఖ్యార్థియై.

కం॥ తనమది నాదినములలో
గణితమునకు విలువలేమిఁ గనుటఁ గుమారున్
ఘనవైద్యు నొనర్చుటయే
ధనగౌరవములకు మంచి దారి యటంచున్

గీ॥ అంపె వైద్యకళాశాల కతనిఁ దండ్రి
కాని యవ్వాని విజ్ఞాన కాంక్ష యపుడు
నివురు గప్పిన నిప్పునా నిలిచియుంట
నొక్క భగవంతుఁ డెఱుఁగుట నిక్కవంబు.

ఉ॥ ఇష్టములేని విద్యయది యెన్ని విధంబులఁ జెప్పిచూచినం
గష్టమెగాని బుద్ధి కతుకంగలదే నరజాతి కెప్పుడే
నష్టమొ లాభమో తనకు నచ్చినదాని గ్రహించి మీఁద సం
తుష్టిని దెల్పుఁగాని తన త్రోవఁ దొలంగుట కిచ్చగించునే.

గీ॥ అతడు చదివెడు విశ్వవిద్యాలయమున
రమ్యతరమైన వాతావరణముకల్మి
వాని విజ్ఞాన తృష్ణయన్ వహ్ని కణము
వెన రగుల్కొను తఱి కప్డు వేచియుండె.

# డోలకనిర్మాణము

వ॥ అదియొక సుదినము, నాఁడు ప్రకృతిమాత ముఖకమలము వికసించి నూత్నశోభల విరజిమ్ముచున్నట్లున్నది. రవి తన దివ్యతేజమునఁ బ్రపంచమున క్రొత్త జీవకళఁ గూర్చి యస్తాద్రి మఱుఁగున కరిగినాఁడు. జగద్బాంధవుఁడు దూరమైనసంధకారాసురుఁ డిజ్జగము నాక్రమించు ననుక్రోధముచేఁ గాఁబోలు దూది పింజల వంటి స్వచ్ఛమేఘఖండము లెఱ్ఱవాఱినవి. క్రమక్రమముగ నా తొగరుఁ జాయ యాకసమున నలువలంకులకుం బ్రాకినది. అది గమనించి వివిధవిహంగవిసరములు కలకలధ్వనులతో గూండ్లకుఁ జేరుకొనుచున్నవి. చీఁకటి రక్కసుఁడు గొంబ వాకిట దోబూచులాడియాడి లోకము నాక్రమింప బయలుదేరినాఁడు. క్రైస్తవ ప్రార్థనమందిరమగు చర్చిలో-

గీ॥ అప్పుడే సేవకుం డొక్కఁ డచట నున్న
కంచు దీపంబు తుడిచి చక్కఁగ నమర్చి
సమయ మని యెంచి వెలిగించి సరిగ దాని
వేగ వ్రేలాడఁ గట్టి తా వెడలిపోయె.

గీ॥ సంజ కెంజాయ పుంజముల్ సమసిపోయి
మసక మసకగఁ జీఁకటి పొసఁగు వేళ
సమ్మదమున గెలీలియో చర్చి కేగి
దీప్తులతోడ వ్రేలాడు దివ్వెఁ గాంచె.

గీ॥ గాంచి నంతన యాతని కమ్రదృష్టి
దానిపై నిల్చె నదియేమొ దైవ మహిమ
మంచి యూహలు ప్రార్థన మందిరమున
కదుగనీయక యచ్చట నాపె నతని.

గీ॥ ఇంతలో భక్తు లంద ఱహీన భక్తిఁ
బ్రార్థనలు సేసి వెళ్ళిరి వారు వెడలి
టతఁడు గ్రహియింపఁడయ్యె నిజాత్మయందుఁ
బొడము యోచన నూత్నమై పొదలు కతన.

వ॥ ఆ క్రొంగ్రొత్త యాలోచన దేనిం గూర్చియో! భక్తాగ్రేసరులు సంచరించు మార్గమధ్యమున నెత్తుగా నతిభారకాంస్యదీపము వ్రేలాడఁ గట్టఁబడియున్న దది తెగినచో యేరికైన నపాయము గలుగుననియా? కాక కళారాధకుఁడుగాన దివ్య శిల్ప సౌందర్యముచే నాకర్షింపఁబడి దాని నుచితరీతి వర్ణించుచుండుటయా లేక తానంతకంటె కాంతిమంతమైన నూతన సృష్టి సేయవలయు ననియా? ఇందేదియుంగాదు. దీప ప్రకంపనమున ద్యోతకమగుచున్న సహజసిద్ధమైన యొకనియమ మాతనిఁ దదాలోచనామగ్నమానసునిగఁ జేసినది. అట్లగుట నతం డొకశిలా విగ్రహము వలె నిలిచిపోయి తదేకదృష్టితో దానిం జూచుచుండె.

గీ॥ తెలియఁగావచ్చె వ్రేలాడఁ దీయఁబడిన
వస్తు వొకవైపునకు లాగి వదలఁ దొలుత
నూఁగు దూరము పెచ్చని యొనర నదియుఁ
గ్రమముగాఁ దగ్గుచుండుటఁ గాంచఁ గలిగె.

గీ॥ అపుడె వైజ్ఞానిక విమర్శ యంకురింప
నూఁగు దూరము తగ్గుచునున్న తఱియు
నూఁపునకుఁ బట్టు కాల మదొక్కటనెడి
భావ మాతని యాత్మలోఁ బ్రభవమందె

గీ॥ ఐన నది సత్యమో కాదొ యరయు టెట్టు?
కాలమును గొల్చు యంత్రముల్ కఱవు కాని
నీటితోడ నిసుకతోడ నీడతోడ
నలరు గడియారములు కొన్ని యచ్చటచట.

గీ॥ వాని యుపయోగ మిప్డాంద వలనుపడదు
కాన యోచింప నొకదారి కానఁబడియె
నెడఁద స్పందన జనితమై యడరు నాడి
తనకు గడియార మగునని తలఁచెఁ దఱచి.

గీ॥ నియత పరిమాణ చలన మందినది నాడి
దానిచేఁ గాలమును గొల్వఁ దగు నటంచుఁ
జేతి మణికట్టు మఱియొక చేతఁబట్టి
యూఁగు సమయముఁ గొల్చుచు నుండె నతఁడు.

గీ॥ తత్ప్రయోగము పలుమార్లు తగ నొనర్చి
యాత్మభావమె నిర్దుష్టమైన సత్య
మనుచుఁ దా నమ్మి యయ్యది జనుల కెల్లఁ
దెలిపి లోలక మొనరింపఁ దలఁచె నపుడ.

వ॥ మున్ముందు నాడీగమనమును దత్పరివర్తనములను గ్రహించుట కనువైన సాధనమును సృష్టించుట మంచిదనితలంచి ప్రయోగము లొనరించి 'పల్సోలోజియా' యను పరికరమును నిర్మించెను. దాని నిర్మాణమునకు లోలకమే మూలాధారము. అది భిషగ్వరేణ్యుల మన్ననల నందుకొని యచిరమ వ్యాప్తిలోనికివచ్చె. గెలీలియో లోలకపుటూఁపును గుఱించి చేసిన ప్రయోగములు తెల్పిన సిద్ధాంతములు వైజ్ఞానిక లోకము నాకర్షించె అనంతర మించు మించుగా సర్ధశతాబ్దమునకు గోడగడి యారము లేర్పడె.

గీ॥ కాల మూల్య మెఱింగిన ఘనులు నేఁడు
పలువిధంబుల గడియారముల ధరించి
దినదినము వాడుకొనుచుంట దివ్యఁ డతని
కెంత ఋణపడి యుండిరో యెవరి కెఱుక.

గీ॥ ఇగ్గెలీలియొ శాస్త్రాంశమే పునాది
యగుచు సృష్టింపఁబడె గడియారము లిల
వాని యుపయోగమును బొందు మానవతతి
మఱచునే వాని నామము మనసులందు.

కం॥ నాడీవిధాన మెఱిఁగిన
పోఁడుములు దడుగుట మనసు పెక్కు పోకలు పోవన్
నాడీనిదానసాధన
మోడక సాధించి జగతి కుపకృతి సేసెఁగా.

కం॥ జిజ్ఞాసియైన మానవుఁ
డజ్ఞానముఁ బాపికొనుచు నన్వేషణమై
విజ్ఞానము నార్జించుచు
సుజ్ఞానిగ మాఱు టెంత శుభసూచకమో.

## గణితశాస్త్రాభ్యాసము

వ॥ అంత

గీ॥ గణితశాస్త్రప్రవీణుఁడన్ ఘనతఁ గన్న
రిక్కి పైసాపురంబున బృథ్వినాథు
కొల్వుకూటమునకు వచ్చెఁ జెల్వు మిగులఁ
జోద్యమౌరీతి పాండితిఁ జూపఁ దలఁచి.

గీ॥ తనకుఁ జిరకాలమిత్రుఁడన్ తలఁపుచేత
వెంటనే రిక్కి విన్సిజో యింటి కరిగె
నట్లు వచ్చిన నెచ్చెలి నరసి ప్రీతి
నతిథి సత్కారముల నతఁ డాదరించె.

గీ॥ అచటనుండియె నిత్య మాస్థానమునకు
రిక్కి వెడలెడి సమయాన బ్రీతితోడ
వెళ్ళెను గెలీలియో వెంట వేడ్కఁ గొల్వు
నందుఁ జూపిన పాండితి కబ్బురపడె.

వ॥ తొలుదొల్త గెలీలియోను జూచి యాస్టిలో రిక్కీ చాల సంతసించెను. రిక్కీ రాజాస్థానమందలి పరిజనముపై బర్యవేక్షణాధికారిగ నియమింపఁబడుటచే నట స్థిరనివాసమేర్పరచుకొని శిష్యులకు యూక్లిడ్ గణితశాస్త్రసిద్ధాంతముల బోధించుతఱి గెలీలియో వాకిట నిలువఁబడి బెదరు చూపులతో నత్యంతాసక్తితో వినుచుండెడి వాఁడఁట. అట్లు వినఁగా వినఁగా నతనికి గణితశాస్త్రముపై ననురాగము గలిగెనని పరులు సూచినఁ [illegible]రేమో యను భీతియు నేర్పడె. చివఱకావిద్యను గట్టి పట్టుదలతో నభ్యసింపవలయుననెడి కుతూహలము హెచ్చ-

కం॥ పేదకుఁ బెన్నిధి దొఱకిన
మోదం బెటులొందు నట్లు మురియుచు బుధుఁడుం
గాదనఁడని యెద నమ్ముచు
నేదో శుభసమయమునకు వీక్షించివెసన్.

కం॥ రిక్కి యూక్లిడ్ గణితముఁ
జక్కఁగ బోధించువేళఁ జాటుగ విని వే
మ్రొక్కి గెలీలియొ తనకది
దక్కఁ బ్రసాదింపు మనుచు దాపునఁ జేరన్.

గీ॥ అతని వినయమ్మునకు శ్రద్ధ కాత్మ నలరి
యూక్లిడార్కి మేడీసు లత్యుత్తమముగ
వ్రాసిన గణితముల రిక్కి వరుస నేర్పె
నది యెఱిఁగి తండ్రి వలదని యతనిఁ దిట్టె.

గీ॥ ఎంత దిట్టిన సార్థక మేమి బడిని
బొత్తముల బల్ల సందునఁ బొందుపఱచి
చదువు బాలుని సంస్కార హృదయ మెఱిఁగి
వాని యిచ్చకె విద్యను వదలెఁ దండ్రి.

వ॥ ఇట్లు పైసావిశ్వవిద్యాలయమున నాల్గు వత్సరంబులు గడచె. కుటుంబ భార మెక్కువగుచు రాఁబడి తగ్గుచుండుటచేఁ గుమారుని విద్యాభ్యాస మెట్లుసాగునా యని విన్సెంజో విచారించుచు నలుఁబదిమంది పేదవిద్యార్థులకొఱకు నిర్ణయింపఁబడిన విద్యార్థి వేతనములలో నొక్కదానిం దన తనూజున కిప్పింపుఁడని తద్విషయాధినాథుండైన ఫెర్డినాండ్ డి మెడిసికి విజ్ఞాపనపత్రము పంపుకొనెంగాని ప్రయోజనము శూన్యమయ్యె.

గీ॥ అంత జీతము సెల్లింప నలవిగాక
వైద్యవిద్యను మాన్పించె వాని తండ్రి
బంధమోక్షంబు వడసిన పక్షిపోలె
నతని కుతుకము చెలరేగె హద్దు లనక.

గీ॥ అందలం బెక్కినట్టు లానంద మొంది
గణిత భౌతిక శాస్త్రాల ఘనతరమగు
పట్టములు వొంది వ్యాసముల్ పత్రిక కిడ
వాని ప్రజ్ఞాద్యుతుల్ దిశల్ ప్రాకుచుండె.

వ॥ చదువు చాలించినంత ఫ్లోరెన్సు నగరమున కరిగి యార్కిమెడీసు రచనలఁ జదివి తత్ఫలితముగ నీటితాసునుగూర్చి ప్రథమ వ్యాసము వ్రాసి యారచయితయందు గురుభావము ప్రదర్శించె. అనంతరము క్షేత్ర గణితమునందును యంత్రనిర్మాణము నందును సమర్థుఁడని ప్రఖ్యాతిపొందెను. అనతికాలములో నతనికి మార్క్వెస్ గైడుబాల్డో యను విఖ్యాత గణితశాస్త్రవేత్తతో మైత్రి గలుగ నతఁడు ఘనపదార్థములలో గురుత్వనాభినిగుఱించి పరిశీలింపు మని గెలీలియోను బ్రేరేపించెను. పెక్కు విషయ ములఁ బరిశోధించి గెలీలియో దానింగూర్చి యొక్క చక్కని వ్యాసము వ్రాసెను, ఆగణితశాస్త్రజ్ఞుఁడే గెలీలియో తెలివి తేటలఁ గూర్చి గొప్పదనమును గూర్చి నాఁటి ప్రభువైన ఫెర్డి నాండుతో నుడువ నారాజవర్యుఁడును సంతసించి ప్రోత్సహింప నది గమనించి పైసావిశ్వవిద్యాలయాధికారు లావిజ్ఞానిభాస్క రుని దమ విశ్వకళాపరిషత్తునందు గణితశాస్త్రాచార్యపదవిని స్వీక రింపు మని కోరిరి. పైసా చేత లేక పైసావిశ్వవిద్యాలయమున వైద్యవిద్యను నడుమననాపుకొనిన బీదవిద్యార్థికిఁ దదాలయమున శీఘ్రమ యుద్యోగము లభించు టెంత యాశ్చర్యకరము.

శా॥ జ్ఞానోపార్జనఁ జూచి రమ్మనఁగ బైసావిశ్వవిద్యాలయా
జ్ఞానమ్మొండయి దానిఁ జేరి గణితాచార్యుండుగా నుండి వి
జ్ఞానశ్రీ నొక నూత్నమార్గమునఁ బెల్పొం దెల్పుచోఁ బ్రాఁత వి
జ్ఞాన మ్మంతయు మార్పు గాఁదొడఁగె లోకంబద్భుతం బందఁగన్

గీ॥ ఎంత వాఁ డుగ్గడించు సిద్ధాంతమైన
హేతుబద్ధము గాకున్న నెగుపఁ గొట్టుఁ
గార్య కారణ సంబంధ గరిమ నెంచి
భావము స్వతంత్ర పథమునఁ బరుగులిడఁగ.

శా॥ శ్రద్ధాభక్తి విమర్శసేయఁగ నరిస్టాటిల్ వచోమార్గముల్
రాద్ధాంతంబున నిల్వమిం దలఁచి యర్వాచీనవిద్వత్కులా
శుద్ధాత్ముండు గెలీలియో నిశితధీశోధించి కోపర్నికన్
సిద్ధాంతమ్ముమతి సత్యమంచుఁ బలికెన్ సిద్ధార్థనిర్ధార్యుఁడై.

## తొలిగెలుపు

వ॥ ఇట్లు కొంతకాలంబు జరుగ నొక్కనాఁటి యుదయంబున బాల భానుని బంగారు కిరణకాంతిలోఁ బైసానగరమునఁ గల యెత్తైన గోపురము తళతళ మెఱయుచుండె. ప్రపంచ చరిత కెక్కవలసిన యోగముంటచే నానాఁడది యందఱి దృష్టి నాకర్షింపం.

కం॥ శ్రీమంతులు ధీమంతులు
పామరులుం బండితులును బాలురు వృద్ధుల్
భామలు బాలిక లచ్చో
నామోదముతోడఁ జేరి రలబల మెసఁగన్.

వ॥ అత్తఱిఁ దన యనుయాయులు విధేయులై రెండు సీసపుగుండ్లు దెచ్చుచుండ నమ్మహాజనమధ్యంబునుండి గెలీలియో ప్రశాంత గంభీరవదనుఁడై వచ్చి విచిత్ర వాక్యములతో సర్వప్రజాళి తన్నాకాంక్షతోఁ గనుచుండఁ గలయం బరికించి దైవమును బ్రార్థించి.

గీ॥ మిక్కుటపు వేడ్క గోపుర మెక్కి నిలిచి
చక్కఁగా రెండు చేతుల నొక్కపాను
గుండొకటి నూఱుపానుల గుండొకండు
నేకకాలంబుననె త్రోచె- నిలకు దిగఁగ

గీ॥ ఏకసమయంబుననె రెండు నిలను దాకి
యేకశబ్దము గలిగించె నేమి వింత!
పూర్వ సిద్ధాంతవాదుల గర్వమడఁగఁ
గువలయముతోడ వారల గుండె లదరె.

గీ॥ అహ్వర! విజ్ఞానవేత్తల భువనమందుఁ
గొక్కొరో యని తొలికోడి కూసి నట్లు
మోగెగె నగ్గుండ్లు కన్నులు వేగఁ దెఱచి
ప్రకృతి సత్యంబుఁ గనుఁడని పలుకు పగిది.

కం॥ కొందఱ కది ముద మిచ్చెను
గొందఱ కది చెప్పరాని కోపముఁ దెచ్చెన్
గొందఱ కది యూహలకే
యందఁగ రానట్టి వింత యనుచుం దోఁచెన్.

ఆ॥వె॥ పెంకు ముక్క గుడ్డ పేలిక నొకటిగా
మేడ నెక్కి విడువ మేదినిపయి
ముందు పడును పెంకుముక్క, దానికి హేతు
వనిల మనుచు దెలిపె నతఁడు ప్రజకు.

ఆ॥వె॥ గాజు గొట్టమందు గాలిని దొలగించి
యినుప గుండొకండు నీఁక యొకటి
విడిచిపెట్ట రెండు పడె నాకశంబున
మిత్ర బృంద మతని మెచ్చుకొనఁగ.

శా॥ శ్రీ ప్రేమాస్పదమై యశోభరితమై చెల్వొ స్వవంశాబ్ధి తా
రా ప్రాణేశుఁ డతండు నవ్య కళలన్ రమ్యంబుగాఁ జూప
రా ప్రావీణ్య మటంచు వృద్ధబుధు వీర్ష్యాగ్రస్తులై దేనికే
దాపుం జేరఁగ నీదు పెంపు సనికల్ దాపంగ నెట్లాగునో!

గీ॥ అమిత లఘువైన వస్తువు నమిత భార
మైన వస్తువును గలిపి యాకసమున
విడువ బరువైన వస్తువు కడు ద్రుతగతి
భువిని బడుట సామాన్యాను భవము సూవె.

గీ॥ మున్నరిస్టాటి లదె సత్య మన్న మెచ్చి
క్రైస్తవమతాధికారులు వాస్తవ మని
వారి యామోదముద్రను వైచి రంత
నందఱును దాని కష్ట దాసోహ మనిరి.

కం॥ విజ్ఞానశాస్త్రవేత్తలు
నజ్ఞానములోన చిక్కి యదె నిజ మనుచుం
బ్రజ్ఞం బరిశీలింపక
జిజ్ఞాసయు లేక యట్ల చెప్పిరి ప్రజకున్.

కం॥ ఆతీరునఁ బడు టెంతయు
వాతావరణావరోధఫలిత మని సదా
యాతఁడు ప్రయోగములఁ బ్ర
ఖ్యాతిగఁ గనిపెట్టి దాని గట్టిగఁ జెప్పెన్.

కం॥ చిన్నది పెద్దది బరువై
యున్నది యిది లఘువుగానె యున్నది యనకే
యన్నియు దివివిడఁ బుడమిని
గ్రన్నన నొకవేళఁ దాకఁ గల్గుట నిజమౌ.

వ॥ అని దాఁ గనుగొన్న ప్రకృతి గర్భగత రహస్య సత్య మరిస్టాటిలు సిద్ధాంతమును ఖండించున దైనను గెలీలియో నిర్భయముగ నుగ్గడింప సనాతనసంప్రదాయపరు లరిస్టాటిలు గ్రంథకంథి నాచమించినయట్టి వృద్ధకోవిదులు వారి పుట్టి మునిఁగిపోయి నట్లు కోపోద్దీపితమానసులై నిన్నగాక మొన్న కన్ను దెఱచిన వీఁడు మాసిద్ధాంతములఁ బూర్వపక్ష మొనర్చునా యీతని వాక్యములు ప్రమాణముగ మేము స్వీకరింతుమా యనెడి యహంకృతితోఁ దమతో శాస్త్రవాదమునకు రమ్మని పిలువ దానికి సమ్మతించి ప్రయోగమూలమునఁ దా నొడివినది నిక్కమని ధృవపఱచ నా ముదుసలి పండితు లతఁడేదో గారడిచేసె నని మూర్ఖముగ వాదించుచు నతని సిద్ధాంతమునందలి సత్యార్థప్రకాశముఁ గనులారఁ జూడఁ జాలక యతని పేరెత్తినఁ దోఁకదొ్రక్కిన త్రాచు వలెఁ గస్సని లేచుచుండిరి, కాని కొందఱు బుద్ధిమంతు లందలి యాథార్థ్యమును గ్రహించి భూనభోంతరాళములు మార్మ్రోగు నట్లు జయజయ ధ్వానములు గావించిరి.

గీ॥ మానవుఁడు ప్రకృతి నడచెడి మార్గవితతి
నాది నుండియుఁ జర్చించి యరయుచుండెఁ
బ్రాఁత సిద్ధాంతలోపముల్ బయలు పడఁగఁ
గ్రొత్త విషయాలు గనుఁగొనఁ గోరు టరుదె?

## రాజీనామా

గీ॥ అపుడ 'గయొవాని-డి-మెడిసి' యనెడి వాఁడు
రాజవంశ్యుఁడు నవసృష్టి రహి వెలుంగ
నమిత కృషిసల్పి నౌకాశ్రయంబునుండి
యంబువులుతోడ నిర్మించె యంత్ర మొండు.

గీ॥ వెంటనె గెలీలియోను బిల్పించి దాని
కార్య సామర్థ్యమును దెల్పఁ గలవె యన్న
నతఁడు త ద్భాగముల నెల నరసి చక్క
నిష్ప్రయోజన మిది యనె నిక్క మెఱఁగి.

గీ॥ పుడమిఁ జేఁ డడిగినను మోమోటపడుచు
నెపుడు సత్యముదాచుట యెఱుఁగఁ డాతఁ
డున్నదున్నట్లు చెప్పుట యుత్తమ మని
యాడుచుండు మహాత్ముల యంతరాత్మ.

కం॥ ధ్వజ మెత్తన రీతిగఁ ద
ద్విజయము పూజ్యంబు నా వివేకము లేమిం
గజమును బులి గనునటు గనె
నిజమాడిన నేరికైన నిష్ఠుర మౌఁగా.

కం॥ తన కవమానముఁ గూర్చఁగ
ననె నిట్లని తలఁచి యాతఁ డాగ్రహవృత్తిన్
ఘనగర్వి వీని నిచ్చట
మననీయ నటంచుఁ జాల మత్సర మూనెన్.

కం॥ హృద్యంబగు నన్వేషణ
పద్యా సంచారి సత్యభాషి గుణి సదా
విద్యా వినోది యన కతఁ
డుద్యోగం బూడఁబెఱక నుద్యోగించెఁ॥.

గీ॥ సమయ మిది యని చాడీలు సరగఁ జెప్పి
పూర్వ సిద్ధాంత విశ్వాస బుద్ధులు పుర
నైంద్రజాలికుఁ డితఁ డున్న హాని యనుచు
నినుని కోపాగ్నిఁ బడవైచి రింధనములు.

ఉ॥ అంతట-నూరకుండక మఠాధిపు డగ్గణి లేని వున్న విం
తింతలుగాఁగఁ జెప్పి పురి నెచ్చట నాతఁ డుపన్యసించుచోఁ
బంతము మీఱఁ జేరి యొక ప్రక్కన మూర్ఖుల రెచ్చగొట్టి య
త్యంతవినోదకేళివలె నల్లరి సేయుదు రాత్మ తృప్తికై.

కం॥ జడమతులగు ప్రజ లోకదెస
నొడయుఁడు వేఱొక్క ప్రక్క నోర్వని కతనం
గడు పుణ్యుఁ డతని జీవిత
మడకత్తెఱలోని పోక యనఁ దగియుండెన్.

ఉ॥ కత్తుల బోనులో నునుచి కాలభటుంబలెఁ దోఁచు ద్రోహికిం
దొత్తయి యాత్మఁ జంపుకొని దోసిలి యొగ్గుచుఁ బల్కుఁ బల్కినం
జిత్తము చిత్తమంచు నిజకీర్తము నూఁపును గంగిరెద్దు నా
నుత్తమ ధీరు వాక్కు విననొల్ల దిదెక్కడి గుడ్డి లోకమో!

కం॥ కావుననే సత్పురుషులు
పావన ధర్మార్థులగుచుఁ బలుబాధలతోఁ
గావించిరి సత్కృతు లవి
జీవించెను వారి పేరు జీవించునటుల్.

గీ॥ పాప పంకిలమైన ప్రపంచమందు
నెవ్వఁ డెట్లు చరించునో యెఱుఁగు దేవుఁ
డతఁడు లేనట్టి చోటు లే దనుట వలన
నతని కన్యాయ మెవనికి నలవియగునుః.

గీ॥ పేద మేధావియై నవ విధి విధాన
సృష్టికిం బ్రతిసృష్టిచేఁ బృథుల కీర్తిఁ
బెలుఁగ లోకము కన్నులు జేవురించు
సర్వ దేశములం గల జాడ్య మిదియు.

కం॥ సత్యాన్వేషణకొఱకై
నిత్యము కృషి సల్పుచున్న నిర్మల మతినిన్
భృత్యునివలెఁ గని కష్టము
లత్యంతము గూర్పఁ దలఁచె నధిపుం డంతన్.

వ॥ జాత్యహంకారము ధనమదము విద్యాగర్వ మధికారాహంకృతి యను వానియందే యొక్కండు కలిగియున్నను మానవుఁడు ధర్మపథమునందు స్థిరముగ నుండఁ జాలఁడు.

వె॥ రాచరీవితోడ రాజిల్లు జనికి
నితఁడు గానిపించె నీఁగవోలె
మేరుధీరుఁడైన మేటి గెలీలియో
యంతఁ దెలియ నతని యబ్బ వశమ.

కం॥ బొడ్డున మాణిక్యము గల
దొడ్డ దొరల్ దమకు నేదొ దోఁచిన యట్టే
విడ్డూర మనక యాడిన
మడ్డి జనుల్ మెచ్చ నద్ది మాన్యం బగునే?

వ॥ అంత రాజాస్థానంబునను పైసా విశ్వవిద్యాలయంబునను దన కననుకూల పరిస్థితు లేర్పడినవని తెలిసికొని యాత్మగౌరవ రక్షణాభిలాషి యగు గెలీలియో తోడన తన యాచార్యపదవికి రాజీనామా యిచ్చె.

కం॥ వాసి గలవార లతనిదె
మోసమ్మని రాజు బుద్ధి పూర్తిగ మార్పన్
వేసరి చెలి సాయమ్మునఁ
బైసా విడనాడి యతఁడు పాడ్వా చేరెన్.

కం॥ వీడు వదలి వీఁ డరుగుటె
వేడుక జనియించె మాకు వేయేల నిఁకం
బీడవదలె నెట కేఁగినఁ
గూడును గుడ్డయును లేక కుములఁడె యనుచున్.

వ॥ పైసాఁగల ప్రత్యర్థులు జరఠ దోషజ్ఞు లతని పోక కెంతయుం సంతసించిరి. కాని సంస్కారప్రియులు, నిరతాభ్యుదయకృత్యాభిలాషులు, గుణగ్రహణపారీణులు చాల విచారపడిరి. ఇట నిట్లుండ గెలీలియో వెన్నిసు రాష్ట్రమున కరిగినంతఁ దద్వార్త నల్దెసఁ బ్రాకె. ఆహా! సూర్యకాంతి ప్రపంచమున వ్యాపింపకుండ నెవ్వఁ డాపఁగలఁడు. అటఁ బ్రజాప్రజం బతని మిక్కిలిగారవించె. ఎనుబది వేల పొత్తములతో నొక గ్రంథాలయము స్వయముగ నేర్పఱచుకొన్న విన్సెంజోపినెల్లీ యను పుస్తకప్రియుఁ డొకఁ డవ్వానికిఁ జెలిమికాఁడై తన్మిత్రుఁడును ఖగోళశాస్త్రజ్ఞుఁడు నగు టైకోబ్రాహీకి గెలీలియోను బరిచయముసేసె. టైకోబ్రాహీతోఁ గలిసి ఖగోళశాస్త్ర పరిశోధనలుచేసిన కెప్లర్ గెలీలియో గొప్పఁదనమును గ్రహించి తా రచించిన "ప్రోద్రోమస్ డిసెర్టేషనమ్ కాస్మోగ్రాఫిక" మను గ్రంథము నతనికిఁ బంపఁ గృతజ్ఞతను దెలుపుచు వ్రాసిన లేఖలో "నార్యా కోపర్నికసు నుడివినదే సత్యము. అతని సిద్ధాంతములవలనఁ బెక్కు చిక్కుసమస్యలు పరిష్కృతములైనవి. వైరుల వాదముల ఖండించుచు నేనును బృహద్గ్రంథమును వ్రాసితి. దాసిం బ్రచురించినఁ గోపర్నికసునకుఁ బట్టిన గతియే నాకుం బట్టునేమో యని కడుంగడు వెఱచుచున్నవాఁడ. అత్యల్పసంఖ్యాకులైన మహామేధావులు కోపర్నికస్ కీర్తి శాశ్వతమైనదని గుర్తింపఁగా నత్యధికసంఖ్యాకులైన వివేకశూన్యు లమ్మహామహుని బరిహాసించిరి. ఈ లోకమున నవివేకుల సంఖ్య హెచ్చుగదా" యని గెలీలియో తన మనఃక్లేశమును వ్యక్తముచేసెను. గెలీలియో జీవితచరితనుగూర్చి యాతని ఖగోళ విజ్ఞానమునుగూర్చి పాడ్వానగరమునఁ బ్రజలు పలువితములుగఁ జెప్పుకొనుచుండిరి. అంత,

# రాజాహ్వానము

శా॥ ఆతం డీగతి వచ్చె నన్న విషయం బాలించి ఫ్లారెన్సు తోఁ
దేతత్పండితుఁ జేరఁదీయఁ దగదే యే జ్ఞానమార్గార్థినై
ఖ్యాతిం గాంచిన ధీరవర్యుఁ డితఁ డేకార్యార్థియై వచ్చెనో
చూతంబంచుఁ దలంచెఁ బెక్కుగతులన్ శుద్ధాంతరంగుండునై

గీ॥ సత్ప్రవర్తనగలవాఁడు శాంతమూర్తి
పరమ విజ్ఞాని యతఁ డుంటవలనఁ దనదు
విశ్వవిద్యాలయపుఁ గీర్తి పెఱుగు ననుచు
నతి ముదంబున వాని కాహ్వాన మంపె.

ఉ॥ మున్నె గెలీలియో యశము పొల్పుగ యూరపు ఖండ మంతటం
దిన్నఁగ వ్యాపియుంట నట ధీవరు లెందఱొ తన్నుఁ జేరుచున్
మన్ననసేయుచుంటఁ దన మానసమందుఁ దలంచుచుండఁగా
వెన్నిను రాజు పిల్పు టొక వేడ్క జనింపఁగఁ జేసె వానికిన్.

గీ॥ ఇటలిఁ గల రాష్ట్రములలోన వెన్ని సెంతొ మంచి
రాజ్య మనఁ జెప్ప నది ప్రజారాజ్య మగుట
ధర్మయుతమైన స్వేచ్ఛకుఁ దా వొసంగి
జనుల కానంద మొనగూర్పఁ జాలియుండె.

గీ॥ అపుడు సర్వాధికారియై యలరు పోపు
ప్రాభవము తగ్గుచుండె దుర్భర విచిత్ర
మూఢవిశ్వాసములతోడఁ బుణ్యపురుష
లెంచి నిచ్చలు మంచిని బోధించుచుండ.

వ॥ మఱియు లోక హితులగు కొందఱు సాంస్కృతిక కార్యకలాపము
లం దిచ్ఛ గలవారై,

కం॥ పోపు నిరంకుశ వర్తన
కోపక యెదిరించి బుధుల కొప్పిన రీతిం
దాపక ధర్మము సెప్పుచు
నాపఁగిడ స్వర్తనంబు నందుం జూపన్.

గీ॥ ధర్మబోధల నజ్ఞాన తమము వాప
విజయ శంఖా రవంబులు వినఁబడంగ
వేగ స్వాతంత్ర్య పవనముల్ వీవఁ దొడఁగె
భావదాస్యాదు లటనుండి పయనమయ్యె.

గీ॥ ఆ పరిష్కృత మతముల యందె ప్రీతిఁ
జూపుచుండిరి పెక్కురు శుద్ధ మతులు
ప్రజలె యననేల రాజులుం బరమ సత్య
మెఱిఁగి తోడన దాని గ్రహించి రెలమి.

వ॥ అట్టి రాజ్యములలో వెన్ని సొకటి

మ॥ ధరణీశుండును ధర్మమూర్తి యయి విద్యాపోషణాసక్తుఁడై
కరుణాసాగరుఁడై సమస్తజన సౌఖ్యశ్రీలు గల్గింపఁగా
సరస్వత్వంబున నెల్ల మానవులు స్వేచ్ఛావాయువుల్ పీల్చుచుం
బరమానందముతో వసింతు రట శుంభత్సంస్క్రియాసక్తులై.

కం॥ పోపు నిరంకుశ పాలన
కేపగిదిం దావు లేమి నెంతొ యలరుచుఁ జ
భూపుని దాపుం జేరఁగ
నాపుణ్యుం డాత్మ నలరి యాదృతిఁ జూపెఁ జ.

వ॥ వారల యిష్టాగోష్ఠి యనంతరమ యారాజు తన పాడ్వా విశ్వ
విద్యాలయమున గణిత శాస్త్రాచార్యులుగా నుండుఁ డని
గెలీలియోను గోరెను.

మ॥ తనకుం దగ్గది వృత్తి యార్థికము చిత్తస్వాస్థ్యముం గూర్చు పా
వనమౌ జీవన మొప్పనంచు వెసఁ బాడ్వా విశ్వ విద్యాలయం
బునఁ జేరెఁ జ శుభవేళ శాస్త్రములలో ముఖ్యాంశముల్ గాఢ శో
ధనముం జేసి యెఱుంగనౌ ననుకొనెన్ ధన్యుం డతం డాత్మలో.

ఆ॥వె॥ గణితబోధకుఁ డయి గంటపన్నెండ్లను
సుష్ఠమాపకంబు నొనరఁ జేసి
ప్రజల కిచ్చినంతఁ బ్రఖ్యాతి హెచ్చెను
వేగ నినుమడించె వేతనంబు.

గీ॥ అరయ రెండును విశ్వవిద్యాలయములె
యైన నొక్కటి బెబ్బులి యైన నొకటి
కామగవియయ్యె విజ్ఞానఘనుఁ డతనికిఁ
బేరులకు నేమి గుణమెకా పెద్ద జగతి.

గీ॥ అతని కమనీయమౌ నుపన్యాసములకు
వచ్చు ప్రజ కంతులేదు తత్పట్టణమున
వాని పాఠములను వినవలయుననుచు
విశ్వవిద్యాలయమునకు వెడలు జనము.

వ॥ అచ్చుగుద్దినట్లు, తీర్చిదిద్దినట్లున్న శరీరావయవశోభతో వేదికపై నిలువఁబడి శ్రావ్య గంభీర కంఠధ్వనితో నుత్సాహ ముప్పొంగ చలోక్తుల విసరుచు నవకాశము లభించినప్పుడెల్ల వర్జిల్ ఓవిడ్, హోరేస్, సెనికావంటి ప్రాచీనగ్రీకువిద్వద్వరేణ్యుల గ్రంథములనుండి యనర్గళముగ నుదాహరణములఁ జూపుచు నతఁ డుపన్యసించువేళఁ బౌరబృంద మానందాబ్ధి నోలలాడుచుండెడిది. కించిల్లజ్జనిరాడంబర మాతనికిఁ బెట్టని సొమ్ములు. అహోరాత్రములు కృషిచేయుచు సమ్మోహనమహుఁడు దుర్గయంత్ర చ్ఛాయాఘటికాయంత్ర చలనశక్తినియమ బ్రహ్మాండాదులఁగూర్చి పెక్కు పొత్తములు రచించె. తచ్ఛిష్యవరేణ్యులాగ్రంథములకుఁ బ్రతులు వ్రాసి యూరపుఖండమునందలి సర్వదేశముల కందఁజేయుచుండ నతనికీర్తి దినదినము వృద్ధియగుచుండె. ప్రవీణుఁడైన యొక కార్మికున కన్నవస్త్రములిచ్చి పోషించుచుఁ దనగీమున నుంచుకొని ప్రయోగములకుఁ దగినరీతిగాఁ బరికరములఁ దయారుచేయించుకొనుచు నొక దిక్సూచియంత్రము నతఁడు నిర్మింపఁజేసె. ఉష్ణమాపకయంత్రనిర్మాణమునకుఁగూడ నప్పుడే పునాది వేయఁబడినది. అది యెట్లన—

గీ॥ మూతిసన్నగఁ బొడవుగాఁ బొదలునట్టి
గాజుబుడ్డిని భద్రముగ నఱచేతు
లందుఁ బట్టి యుంచుకనొక్క యవల దాని
నీట ముంచంగ లోనిక నీరు ప్రాకె.

గీ॥ అతని చేవేడి బుద్ధికి నందకున్న
యంత నద్దానిలోనికి నరిగె నీర
మది పునాదిగ గ్రహియించి యతఁడు పిదప
మష్టమాపకమునుజేసి యొందెఁ గీర్తి.

## దుర్భిణి - గగన పరిశోధన

వ॥ అతం డనుకొన్న యట్ల యాచార్యపదవియందుండియు ననన్య సామాన్య పరిశోధనాయత్తచిత్తుండై యచంచలదీక్షతోఁ గృషి సల్పుచుండ.

గీ॥ కంటి యద్దాలతో నొక కర్మకారి
చిన్న మఱచేసె దానిలోఁ గన్న దూర
వస్తువులు దగ్గఱగఁ గనఁబడెడి వార్త
యరుగుదెంచెను హాలెండు పురమునుండి.

వ॥ అది యెట్లన హాలెండు దేశీయుఁడగు హెన్సు లిపర్షె సులోచనముల నిర్మాణమునకై కటకముల గాచుచు దైవప్రేరణమునఁ దనయొద్దనున్న కటకద్వయము నొకటికిఁ జేర్చి వాని ద్వారమున నెట్టయెదుటి రాజమార్గము చివఱనున్న 'చర్చి' నవలోకింప నది కదుంగడు సమీపముగను దలక్రిందుగను గానంబడియె. అంత నతఁ డబ్బురంపడి యా రెండుగొట్టముల సనాయిగొట్టమున నమర్చి యా వింత నందఱకుఁ జూపుచుండఁ దద్వృత్తాంత మా ఖండమంతయు నలముకొని యలంకర్మణుఁడైన గెలీలియోకుఁ దెలిసినంత నే కటకగ్రథనమ్మున దూరదర్శకోపకరణసూత్ర మిమిడి యున్నదని దృఢముగ విశ్వసించెను. కాని లిపర్షె దానిఁగూర్చి యెట్టి యాలోచనయుం జేసియెఱుంగఁడు. ఆరెంటినిం గూర్చి చూచిన నట్లు గనంబడు ననియు నతఁడు దలంపలేదు. అవ్విధంబున గోచరించుట కెద్ది హేతువనియు యోచింపలేదు, అతనికి విద్య తక్కువ. విజ్ఞానికాఁడు. కావున దాని పూర్వాపరంబులఁ గూర్చి

దీర్ఘాలోచనాసక్తుఁడు కాఁజాలకపోయెను. దానికిఁ దగిన సామర్థ్యముగాని విశేషజ్ఞానముగాని లేమిం జేసి యతఁ డంతటితోఁ దృప్తి వహించెను. గెలీలియో యట్లూరకుండక ప్రకృతి విజ్ఞాన ధర్మపయఃపారావారగర్భమున దాగియున్న సత్యరత్నముల సంపాదింపఁ దలఁచిన వాఁడగుటం జేసి తత్క్షణంబ తత్పరిశోధనంబునకుం గడంగి దాని రహస్యమును దెలిసికొనెను.

చ॥ అది మది కింత యంత యని యాడఁగరాని ముదంబుఁ గూర్చు నే
విధినయినన్ సుదూరమున వెల్గు గ్రహాదులఁ జాల చేరువం
బొదలిన రీతిఁ జూపఁ గల ముద్దుల జంత్రి మొనర్చు దాననే
హృదయవిచిత్రదృశ్యతతి యేఁ గననౌనని రాత్రియంతయున్.

గీ॥ కష్ట బడబాగ్ను లెన్నియో గడచి నిలిచి
ప్రకృతి గర్భ గృహద్వార పటలిఁ దెఱచి
మర్మకర్మంబులకు రూపు మలఁచ దలఁచి
యతఁడ గనిపెట్టె "దుర్భిణి" యంత్ర మపుడు.

వ॥ అదెట్లన నొక సీసపు గొట్టమున కొకవైపు సమముగనుండునట్లు రెండద్దములు బిగించె. రెండవవైపున నొకటి లోపలికి వంగి యుండ రెండవది పైకుబ్బియుండు నట్లొక క్రమంబునఁ గూర్చి దాని ద్వారమునఁ జూడ నేఁబది మైళ్ళదూరమునఁ గల వస్తువైదు మైళ్ళదూరమున నున్నట్లు కనఁబడుచుండె. ఏవస్తువైన నున్నదానికంటెఁ దొమ్మిదిరెట్లు పెద్దదిగ గోచరించుచుండె. అంత విశ్వవిద్యాలయాధికారులకు విజ్ఞానవేత్తలకు సద్ది చూపఁ దలంచి గెలీలియో వెన్నిసు నగరమున కరిగె. అట—

ఉ॥ కేవల నేత్రదృష్టిఁ దిలకింపఁగ జాలని దూర నౌకలన్
వేవురు దుర్భిణిం గనుట వెన్నిసు పట్టణ మెల్లఁ బ్రాఁకఁగా
రేవన నేల యీనినటు ప్రేక్షకలోకము వచ్చి గోపురం
బవి[illegible]నైన నెక్కి యమితేచ్ఛఁ గనెన్ నవదూరదర్శినిన్.

వ॥ తత్పట్టణపాలకుఁడు స్వయముగాఁ దానును దిలకించి యిట్టి పని ముట్టుతో సైనికనావికచర్యలు శక్తిమంతముగ నిర్వర్తింప వీలున్న దని గ్రహించి దానిపైఁ గన్నిడె. అది గమనించి గెలీలియో దానిని వాసికి బహూకరింపవలయునని యాస్థానసీమను దాటి "సెనేట్" భవనమునకు వచ్చినంతఁ గొంచెమాగుఁడని వార్త వచ్చె. అనంతరము కొన్ని నిముసముల కధ్యక్షునిప్రతినిధి ప్రియోలీ వచ్చి కరస్పర్శచేసి "మా విశ్వవిద్యాలయమునకు సంబంధించిన పాఠ్యకళాశాలలోఁ బదునేడువత్సరములు శ్రద్ధాసక్తులతో మీరు పనిచేసిన సంగతి మా "సెనేటు" నకుఁ దెలియును. మీరు సృజించిన దూరదర్శిని మా విశ్వవిద్యాలయమునకుఁ గానుకగా నీయఁదలచిన సందర్భమున మీ ప్రత్యయమును గమనించుచు సంవత్సరమునకు వేయి 'ఫ్లోరిన్' ల యుపకారవేతముతో యావజ్జీవితాచార్యుఁడుగ సెనెట్ మిమ్మెన్నుకొన్న' దని పల్కె. అది విని యతఁ డెంతయు సంతసించె.

గీ॥ వీఁక యంత్రమ్ముతోఁ బాడ్వాకు నరిగి
విశ్వవిద్యాలయమున కర్పింప దాని
వేతనము హెచ్చె గౌరవబిరుద వితతి
జీవితాంతము పదవికి స్థిరము గలిగె.

వ॥ భూమిపై దవ్వునఁ గల వస్తువులఁ జూచుటతో నతని హృదయము తృప్తి పడలేదు.

శా॥ ఆరే యుత్తరదక్షిణంబులుగ దేవానీకముల్ దిగ్గు కా
శీరామేశ్వరమార్గమంచు మఱియుం క్షీరాపగా రూపమం
చీ రీతిం బచియించు దృశ్యమొగి తా నీక్షించి యంత్రంబులోఁ
దారానీక మనంతసంఖ్య వెలుఁగుం దథ్యంబు ముమ్మాటికిన్.

కం॥ అని నిశ్చయించి వెంటనె
తనయంత్రము ద్రిప్పె నిందు ధర్మముఁ జూడన్
గన నది మనభువి వంటిదె
యని నలుపు లగమ్ము లనుచు నబ్బురపడియెన్.

గీ॥ గగన పరిశోధనమునకుం గడఁగి తొలుత
దూరదర్శినిఁ జేకొన్న ధీరుఁ డతఁడె
మిహిరకిరణుని గన్గొన మిఱ్ఱు పల్ల
ములును గిరులును గలవన్న పూజ్యుఁ డతఁడె.

వ॥ పాలపుంతను దిరిగి పరిశోధించి యది యగణితాల్పబుద్బుదవితానముతోడను నక్షత్రాత్యంతసూక్ష్మవారిదములతోడను నేర్పడినదనియు మృగవ్యాధకూటమున నించుమించుగ నైదువందల చుక్కలున్నవనియు నట్లు సప్తనక్షత్రశోభితమనుకొన్న కృత్తికలో ముప్పదియాఱువఱకున్నవనియుఁ దెలిసికొనెను.

కం॥ తనచుట్టుఁ దా భ్రమించుచు
ఇను చుట్టుం దిరుగు భూమి నిల చుట్టు నొగిం
జనుచుండు చందురుం గని
మనమునఁ గల సంశయములు మాయంబగుడున్.

కం॥ దినకరు చుట్టుం దిరిగెడి
దనుజగురుం జూచి పిదపఁ దనయంత్రమునన్
శని చుట్టి వచ్చుగోళము
లనుగని యెంతెంతొ లెక్కలను దా వేయున్.

కం॥ వరుసగ గ్రహగతిఁ గాంచుచు
గురువును గన నాల్గు చిన్నిగోళము లతనిన్
గిరగిరఁ డిరుగుచుఁ జుట్టుట
కరమరుదుగఁ దోఁచె నతని కందోయి కటన్.

గీ॥ శాంతిఁ గన సూర్యకేంద్ర సిద్ధాంతమునెడ
గురువు చుట్టును నిత్యంబు తిరుగుచున్న
నాల్గుపగ్రహములె మది నాకు నమ్మ
కమునకు నిదర్శనములయి క్రాలుచుండె.

వ॥ అని యనుకొని తత్సిద్ధాంతమును బూర్తిగ విశ్వసించెను.

శా॥ ఆ వీక్షారసలుబ్ధుఁడై జయమహాహ్లాదాబ్ధి నోలాడుచుఁ
దేవా! యీశ్వర! నీ దయామహిమ జ్యోతిర్గోళనైసర్గిక
శ్రీవిన్యాసవిలాసవిభ్రమము సంప్రీతిం గనం జాలితిఁ
భావంబిప్పుడు నిండుకుండ యగు నా భాగ్యంబు సామాన్యమే!

కం॥ ఇంక టాలెమి సిద్ధాంతము
లొకటొక్కటి పూర్వపక్ష మొనరిచి నిజముం
బ్రకటింతు యంత్రముఖమున
సకలము దైవాజ్ఞ యనుచు సంతృప్తి పడెన్.

కం॥ అనవద్య హృద్య విద్యల
ననయంబు నయంబు మీఱ నందుకొనెడి బం
ధనము ధనమ్ముగఁ దలఁచెడి
ఘనుఁ డతనికి దివ్యదృష్టి కలుగుట యరుదే?

వ॥ అంత నతఁడు దన ప్రయోగములవలనఁ గనిపెట్టిన సత్యములను వెల్లడింపఁ దద్దేశప్రజలకు ఖగోళవిజ్ఞానవిషయమున నొకనూతన చైతన్యము గలిగెను. జను లెక్కడఁ జూచినను గెలీలియో ప్రతిభనుగూర్చి మిక్కిలి ప్రశంసించుచు విశ్వమునకు భూమి కేంద్రము కాదనియు సూర్యుఁడే గ్రహమండలమునకుఁ గేంద్రమనియు విశ్వసించుస్థితికి రాఁదొడంగిరి. అది యరిస్టాటిల్ సిద్ధాంత వాదుల కందఱకుం గొడ్డలి పెట్టుకాఁగా వారలు,

కం॥ కత్తులు దూసిరి యాతని
నెత్తులపై నెత్తు లొడ్డి యేగతినైనఁ
గుత్తుక విసమ్ము గ్రక్కుచు
నత్తఱి బాధింపఁ దలఁచి రంద ఱొకటిగా.

వ॥ తొలుదొల్త వారు దూరదర్శినిని బరిహసించుచు నందుఁ గనఁ బడునది మిథ్యయనియు నదియున్నది లేనియట్లు లేనిది యున్నట్లు చూపఁగల మాయాయంత్రమనియు గురుగ్రహమున నుపగ్రహములు లేవనియుఁ బ్రచారముచేసిరి. దేవతలు సూర్యాదిగ్రహ

ములగ [illegible]త్రమే నిర్ణీతవలయములోఁ దిరుగునట్లు సృజించి[illegible]డిచిరి. భూమి తిరుగుచున్నచో దానిం ద్రిప్పు దేవత భూకేంద్రమున నుండవలయు. దేవత లేదుకాన దయ్యము త్రిప్పుచున్న దేమో అట్లైన భూమి భ్రమించుచున్నదని చెప్పువాఁడు పిశాచములకు సంబంధించినవాఁడు. గ్రహములు నక్షత్రములోకే విధానమునకుఁ జెందినవి. తిరిగినవన్నియుం దిరుగు నిలిచినవన్నియు నిలిచి యుండు. అదియునుంగాక పాపపంకిలమైన పుడమి దివ్యగ్రహములతోఁ జేర్చుట మిక్కిలి కిల్బిష మని వాదించిరి.

ఆ॥వె॥ ఎంత దుష్ప్రచార మెవ్విధిఁ జేసిన
సత్యమునకు లోటు జరుగఁ గలదె
వైరి తంత్ర ఘోరవారిదముల్ వాని
వాక్ప్రభంజనమున భంగపడియె.

వ॥ అనంతరము కొంతకాలమున కుద్యోగము గ్రంథపఠన రచనాదుల కాటంకముగ నున్నదని గెలీలియో గ్రహించెను. ఎసలిక యున్న ఈశ్వరహాస్యమునుగూర్చి గ్రంథద్వయమును స్థానికచలన యాంత్రిక విశేషాంశములపై నాలు గ్రంథములను సప్రమాణముగ నతఁడు రచింపఁదలఁచె. మఱియు శబ్ద, భాషా, దృష్టి, [illegible]ధ. సత్త్వచలనములఁగూర్చి వ్రాయవలయు ననుకొనె. అంతియకాక సైనికనిర్మాణ వ్యూహారచ నాత్మరక్షణాదులఁగూర్చి పెక్కు పొత్తములు లిఖింప సంకల్పించె. అమ్మహాకార్యక్రమ నిర్వాహణమునకై యాచార్య పదవికి రాజీనామా యొసంగె.

## రెండవ కాస్మో యాహ్వానము

గీ॥ దూరదర్శిని నిర్మాణ కారణమున
దశదిశావ్యాప్తమయ్యెఁ దద్యశము పెలుచ
నపుడ పైసాధిపతి దివి కరిగి నంత
వెలరె రెండవ కాస్మో ధరాధిపతిగ.

గీ॥ అతఁడు విద్యాధికుఁడు పరమార్థవాది
తత్త్వశాస్త్రాభిమాని శాంతస్వభావుఁ
డతనికి గెలీలియో యెడ నమిత గౌర
వంబె కాదు నిర్మల గురుభావ ముండె.

గీ॥ దాన నతఁడు గెలీలియో తనదు రాజ్య
మందు నివసింపఁ దద్కీర్తియందుఁ గొంత
దక్కఁ దనకని మది నెంచి తగిన రీతి
నతని రప్పింప మార్గము నరయుచుండె.

గీ॥ అంత నొకనాఁడు భూపుఁ డాహ్వాన మంప
వచ్చెను గెలీలియో క్రొత్త ప్రభువు కడకు
వాని రాకకు సంతోషపడుచు రాజు
లలితగతి నివ్విధంబునఁ బలుకఁ దొడఁగె.

వ॥ విజ్ఞానిసార్వభౌమా! ప్రకృతి సత్యాన్వేషణతత్పరులైన మీ జీవితమునకు వలయు ధనము సమృద్ధిగ నొసంగెద. మిమ్మన్ని విధముల నాదరించెద. పాడ్వావిశ్వవిద్యాలయమునందలి గణితాచార్యపదవికి రాజీనామా యిచ్చి యిటకు వచ్చి మీ జన్మభూమియైన ఫ్లోరెన్సు నగరమందేయుండి యథేచ్ఛముగాఁ బరిశోధనంబులు జరుపుకొనుట మాకు ముదావహము. మీరు మా రాజ్యమున నుంట మా కత్యంతానందకరమని కోర దేశకాల పరిస్థితుల గమనింపక సర్వ విషయంబుల సమాలోచనసేయక వెంటనే వల్లెయని వెన్నిసు ప్రభువునొద్ద సెలవు తీసికొని ఫ్లోరెన్సునగరముఁ జేరెను. తత్పురాధినాథుఁడు వర్షమున కైదు వేల రూప్యము లొసంగుచు నతనిని దన యాస్థానతత్త్వవేత్తగా నియమించెను. ఉద్యోగమునఁ బ్రవేశించినంతన గెలీలియో రెండుసంవత్సరముల జీతము ముందుగఁ దీసికొని తన బావమఱఁదుల కీయవలసిన కట్నపుబాకీలు తీర్చెను.

గీ॥ స్వర్గమునకంటె మిన్నగా జన్మభూమి
నెన్నుదురు పుణ్యశీలు రత్యున్నత మతి
నవ్విధి గెలీలియోకూడ నాత్మ నెంచి
తన జనుర్దేశమునముండ దలఁచెనేమొ.

వ॥ ఏ మానవుఁడు స్వమాతపై స్వస్థలముపై స్వభాషపై స్వదేశముపై నభిమానము చూపకుండును.

కం॥ వెన్నిసు రాజ్యము వదలిన
నన్నియుఁ గష్టములె యనుచు ననుకొనక కలా
భ్యున్నతిఁ బడయుదు ననుకొని
మున్నెన్నఁడు పొందనట్టి ముదముం బొందెన్.

గీ॥ ఎపుడు వెన్నిసు వదలెనో యపుడె కష్ట
భూతములు చుట్టుముట్టగాఁ బొంచియుండెఁ
బొంచియుండుట నెఱుఁగఁ డాపుణ్యుడపుడు
దైవ నిర్ణయ మెవ్వండు దాఁటఁగలఁడు.

వ॥ నూతనముగఁ దాఁ గనుగొన్న వ్యోమ విజ్ఞాన విశేషాంశములఁ గ్రైస్తవ జగద్గురువగు పోపునకుఁ దక్కుంగల ప్రధానమతాధికారులకుఁ దెలుప గెలీలియో రోమున కరిగె. ఆ పయనపు వ్యయమంతయు గ్రాండుడూక్ రెండవకాస్మో భరించె. వాటికన్ పట్టణమున మతాధికారులు గెలీలియోను గౌరవించి దూరదర్శిని సాయమున దివిఁగల యద్భుత దృశ్యముల సందర్శించి సంతసించిరి. కాని, విశ్వంభర తిరుగదని బైబిలులోఁ జెప్పిన మహావాక్యమును గాదనరాదనిరి. వారు ప్రశంసించుట పైకి మాత్రమే. హృదయమునం దతని నెదుర్కొనవలయుననియే వారి కోరిక. ఆసమయమున నావిజ్ఞానివరేణ్యుఁడు "మఱొకవిధముగ వ్యాఖ్యానముచేయుటకు వీలుగాని యట్లు బైబిలులో దేవదూత చెప్పినవి మోక్షాసక్తులు విశ్వసింపఁదగు. దేవదూతకు దెల్పిన భగవంతుఁడే మనకు హేతుజ్ఞానమును, సదసద్వివేకమును, దశవిధేంద్రియములను బ్రసాదించినాఁడు. వాని ద్వారమున సృష్టిరహస్యము

నెఱుఁగ మన కధికారమున్నది. శాస్త్రజ్ఞానవిషయమునఁ బవిత్ర మతగ్రంథములలోఁ గొన్నియెడలఁ బరస్పర విరుద్ధములుగఁ గూడనున్నవి. తద్గ్రంథముల ఖగోళమునుగూర్చి యంతగా లేదు. గ్రహము లెన్నియని మన పూర్వులు సరిగా నిర్ణయించినట్లు కానరాదు. కాన నిట్టి చర్చలో మతగ్రంథములందుఁ జెప్పిన దానిని దప్పక నమ్మవలసిన యక్కఱ నాకు లే"దని వాదించెను. కోపర్నికస్ సిద్ధాంతములు సరియైన వను గ్రంథములనన్నిటిని నిషేధింపవలయు నని మతాధికారులు పట్టుపట్టిరి. తన రచనల కిఁకఁ బ్రపంచమున స్థానముండదని గెలీలియో కుంగి కృశించి పోయెను. ఐనను దనకృషిని మానలేదు.

గీ॥ రాష్ట్రములలోన 'టాస్కని' రాష్ట్ర మొకటి
తొంటి విశ్వాసములఁ దులఁదూఁగుచుంట
నభ్యుదయభావబీజము లంకురింప
దారి గనఁబడ దచట నెందనుకఁ గనిన.

గీ॥ ఇందనుక వృద్ధవాక్కుల నెంత మంది
మతము పేర మహాత్ములు మడసినారొ
తాను వినియును నిశ్చింతఁ దనరెఁగాని
యింత యోచన సేయుట యెఱుఁగఁడయ్యె.

వ॥ అనంతమైన కాలగర్భమునం దేమి దాగియున్నదో యేరి కెఱుక. అంతయు నీశ్వర విలాసము. అనంతరము గెలీలియో తన జన్మభూమియందు స్థిరనివాస మేర్పఱిచికొన్నంతనే యనూహ్యమైన యద్వితీయమైన యవ్యక్తమధురమైన యానంద మతఁ డనుభవించుచుండె. కాస్మోప్రభువు వలసినంత రొక్క మిచ్చుచుంటచే నాతని భౌతిక జీవయాత్రగూడ సుఖప్రదముగ నుండెను. "విద్వాన్ సర్వత్ర పూజ్యతే" యను సూక్తియుక్త ప్రకాశింపకుండునా? సాయంతనపుటింద్ర చాపంబువలె నీయనుకూల వాతావరణ మెక్కువ కాల ముండదని యాతనికి దెలియదు. అందుచే నతఁడు సంతోష భరిత మనస్కుఁడై తన దూరదర్శినీ

యంత్రద్వారమున నంతరిక్షమును బరీక్షింపఁ బ్రారంభించెను. శుక్రుని జూచెను. శశివలె నతఁడును వెలుఁగుల వెలార్చుచుండె నని గ్రహించెను. శనిగ్రహమునందుఁ గూడఁ గొన్నియద్భుత దృశ్యములఁ గాంచఁగలిగె. పిదపఁ దన దూరదర్శినీ యంత్రము నందుఁ దేజముసహింపఁ జాలునట్లు కొలఁదిగ మార్పులు సేసి కొని సూర్యమండలమును సునిశితదృష్టిం దిలకించెను. అతని సత్యాన్వేషణశక్తి యొక్కొక్క మెట్టు పైకెక్కుచుండుట కిది యొక దృష్టాంతము. అతఁడు మహామేధావి కావున మహోజ్జ్వల ముగ మండుచున్న సూర్యుని చూచుట కనువుగఁ దన యంత్ర మును సులువుగ మార్చుకొనఁగలిగెను. నిరంతర కాఁతితరంగ ములతోఁ దళతళ మెఱసిపోవుచు దుర్నిరీక్ష్యముగనున్న ప్రభా కర గోళోపరితలమును బ్రశాంతముగఁబరీక్షించి కాంతిహీన మైన మచ్చలు కొన్ని యాగోళమునఁ గలవని యతఁడు నిశ్చ యించుకొనెను. ఆ మచ్చల యునికిని బహుకాలము పరిశోధ నంబు సేయఁగా జగచ్చక్షువైన సూర్యుఁడు గూడ నాత్మప్రద క్షిణ మొనర్చుచుండెనని యాతఁడు నిశ్చయముగఁ దెలిసికొనఁ గలిగెను.

గీ॥ తెలిసికొనినట్టి సత్యంబు తెలుపకుండ
నెట్టులుండును నతఁడింత పట్టు పట్టి
చేయునన్వేషణము జగద్రేయమునకె
యంచుఁ దన యాత్మ సతము దలంచియుంట.

గీ॥ సూర్యగోళమునం దాను జూచునట్టి
క్రొత్తసంగతులను జంకు కొంకు లేక
తెలుప భాస్కరు నీరీతిఁ బలుకు టరయ
నేర మగునని రి మతాధికారు లపుడు.

వ॥ పైనుండి యిలంబడు వస్తువులంగూర్చి యరిసాటిలు సెప్పిన సిద్ధాంతములు తప్పనిననాటినుండి గెలీలియోను వారు మత ద్రోహిగాఁ దలంచిరి. దానికిందోడు జాబిల్లిలో మిట్టపల్లముఁ

లున్న వనుట పూర్వులు చర్మచక్షువులతోఁ గనుగొన్నవాని కంటె నాకసమున నధికముగ నక్షత్రములున్నవనుట భూకేంద్ర సిద్ధాంతము సరికాదనుట కడకు రవి మచ్చలున్నవనుట మతాధి కారుల క్రోధాగ్ని నాజ్యము వోసినట్లయ్యె. ఈ విషయమంతయుఁ బోపు చెవింబడ నతఁడు మండిపడె.

## పోపు పిలుపు

శా॥ పో పాకోపము పట్టలేక యరెరే భూకేంద్ర సిద్ధాంత మా
పాపుం డీగతిఁ దప్పుగాఁ బలుకునే ప్రత్యక్షదేవుణ్ రవిం
బాపంబంచుఁ దలంప కిట్లనునె యమ్మా యెంతవాఁడయ్యె నే
పాపీనీచుని గాచునో గనెద మత్ప్రాబల్య మేపారఁగణ్.

సా॥ అనుచుం గన్నుల నిప్పులొల్క నధరం బల్లాడ భృత్యు న్వెసం
గనుచుం దద్విషయంబు సెప్పి యతఁ డజ్ఞానాంధకారంబునం
గనుగానం డిఁక నోర్వ గూడదని వేగం బత్రముణ్ వ్రాసి పం
పెను దద్పూపుఁడు టస్కనీ కతఁడు హృద్వీథిణ్ భయంబందఁగన్

గీ॥ పత్రముణ్ విప్పి చదువ "నో ప్రభువ నీవ
యల గెలీలియో రోమున కంపవలయు
నట్టు పంపుటె గాదు నాయెట్ట యెదుట
నతని నిలుపుమ యియ్యది యస్మదాజ్ఞ"

మ॥ అని యందున్నది ఱేఁడు చూచుకొని యారాయించు జింతించి దా
నిని విజ్ఞాని గెలీలియోకు దెలుపణ్ నిర్విణ్ణుఁడై యాతఁ డా
ఘను లేరీతిఁ జరింతురో నిజము సక్కందెల్ప నావింతురో
వినరో దేవుఁ డెఱుంగునంచు మదిలో బెగ్గిల్లి నిశ్చేష్టుడై.

వ॥ నా యీ కష్టముల కన్నింటి కీవృద్ధపండితులు సనాతన సిద్ధాంత వాదులు కారకులు. లోకులు వారిమాటలు సులభముగ నమ్ము చుందురు.

గీ॥ ధాత్రిఁ గోపర్నికసుని సిద్ధాంతములఁ బ్రి
చార మొనరించెనని మహాఘోరపాపి
యని వధార్హుఁడని నికృష్టుఁడని పలుకుచు
నేమి చేసిరో బ్రూనోను స్పృహకు వచ్చె.

మ॥ కల వీ భూమిని బోలు లోకములు నక్షత్ర సృష్టియం దెన్నియో
తెలియంజాలెడి శక్తి యున్నయెడ సందేహంబు నేఁ దీర్తు నాఁ
బలుచన్ 'బ్రూనొ' సుధీంద్రుఁ బట్టి చితిపైఁ బెట్టించి కాల్పించి రా
పలుగాకుల్ పికగానసంగతి గ్రహింపం జాలునే కాకముల్.

గీ॥ ఇట్టి పరిశీలనముసేసి యెఱిఁగి నంత
సత్యమును జెప్ప నాకెట్టి చావు గలదో
మతము విజ్ఞాని కీరీతి మరణ దేవ
తయగుట కటకటా యెంత దౌష్ట్య మరయ.

గీ॥ నిరిఁశంకంబుగా ధర్మనిగ్రహంబుఁ
దప్పి సాధుల శిక్షింపఁ దగునె మనకు
ననుకొన రిదేటి కర్మమో మనుజ జీవ
మనిన నింతటి తేలిక యౌట యరిది!

గీ॥ పోపు మాటను గాదనఁ బోల దనుచు
హృదయ భారంబుతో నతఁ డేఁగె నటకు
మతగురువుతోడ నూతన మార్గములను
వినయ వినమిత గాత్రుఁడై విశదపఱిచె.

గీ॥ పలువురు మతాధికారులు కొలిచియుండఁ
బోపునకుఁ బూసగ్రుచ్చిన పోల్కిఁ దెలిపె
నెంత చెప్పిన గురువుల కేమి లాభ
మొక్క మాటైనఁ జెవులకు నెక్కదయ్యె.

గీ॥ తఱచి ఘంటాపథంబుగ ధన్యుఁ డతఁడు
తనదు సిద్ధాంతములు సత్యమనుచుఁ జెప్ప
బధిరునకు శంఖ మూఁదిన భంగి యగుటఁ
దలఁచి లోలోన దుఃఖించె ధర్మపరత.

గీ॥ కడకట మతాధికారులు కాంచి యతని
భూభ్రమణ వృత్తమును జెప్పఁ బోల దీవు
నమ్మరాదద్ది దిరుగుట నెమ్మనమున
ననుచు శాసించి విడిచి రయ్యవసరమున.

గీ॥ తోన ఫ్లారెన్సునకు వచ్చెఁగాని యతఁడు
స్వేచ్ఛగాఁ బల్కుటకుఁ గాని స్వేచ్ఛ నూహ
సేయుటకుఁగాని హక్కేదఁ జింతతోడ
ఱెక్క లూడిన పక్కినా నక్కియుండె.

గీ॥ అట్టి సందిగ్ధసమయంబు నందమోఘ
మాత్మ తరిశోధనాసక్తి నూల్కొనమిని
నతని యుజ్జ్వల యూహ లప్డణఁగియుండెఁ
బంజరంబునఁ జిక్కిన పక్షి భంగి.

వ॥ మతాధికారుల యాజ్ఞాశృంఖలములఁ జిక్కి నానాఁటికిఁ గృంగి పోవుచుఁ జేయునది లేక ఫ్లోరెన్సుచెంత బెలూసుగార్డో సమీపమునను సెన్నికోటలోని స్వగృహంబున నుండ గెలీలియో కతని యాత్మజ పాలిస్సెనా సర్వవిధముల సహాయపడెను. సోదరి మేరియాసెలెస్టీ యను పేరుతో నప్పుడు పాలిస్సెనా యొక కాన్వెంటులోఁ బనిచేయుచుండెను. ఆమె యమిత పితృభక్తి వెల్లివిరియునట్లు తండ్రికిఁ దఱచుగ నుత్తరములు వ్రాసెడిది. అందొక్క లేఖ "మీకు నుడకబెట్టిన రెండత్రిపండ్లఁ బంపుచున్నదాన. వాని విషయ మట్లుండ నీ యకాలమున బాగుగా విచ్చిన యందమైన యొక గులాబిపువ్వునుగూడ నందఁజేయుచున్నదాన. పుష్పముతోఁబాటు కంటకములఁ గూడ మనము భరింపక తప్పదు. పూవుతోఁగొన్ని పచ్చని పత్రములు గూడ నున్నవి. ఈ యాకులు మనలో నిచ్చలు పొడమూపుచుఁ గ్రొంగ్రొత్త కాంతుల విరజిమ్మునట్టి యాశలకుఁ బ్రతినిధులు. దుఃఖోపేతమైన యిహలోక జీవితశిశిరానంతరము నాకలోకమున మనకు శాశ్వతవసంతశోభ ప్రాప్తింపఁగలదని నా విశ్వాసము. నాచేతులతో మీకు సేవచేసెడి భాగ్యము నాకు లేదని చింతించు

చున్నవాఁడ" నని యామెవ్రాసెను. అతఁడును బిడ్డపై వాత్సల్యముతోఁ దగిన రీతిగ జవాబులు వ్రాయుచుండెడివాఁడట.

గీ॥ అష్ట వర్షంబు లీరీతి నరిగినంత
పోపు పంచమ 'పాల్' చనిపోవ నప్పు
డచట బార్బరినో యను నతఁడు పోపు
పీఠ మెక్కెను గ్రీస్తు వప్రీతి దనర.

గీ॥ సఖుఁడు నాకలవిజ్ఞాన శాస్త్రపరుఁడు
వచ్చె బార్బరినో యను వాఁడు పోపు
గా మదీయ కష్టాంబుధిఁ గడచి సుఖము
లందుదు నని గెలీలియో యాత్మఁ దలఁచె.

వ॥ బార్బరినో కార్డినల్‌గానున్నతఱి గెలీలియోను బ్రశంసించుచు నొకకమ్మవ్రాసె. దానియందు "విజ్ఞానిశేఖరా! మీ యందు నాకత్యంత గౌరవభావమున్నది. అద్వితీయ మహత్తర త్వత్ప్రతిభాద్యోతకముగ నిర్వహింపఁబడిన పరిశోధనలనభినందించుచు నా రచించిన పద్యరత్నముల నీలేఖతోఁ గానుకగఁ బంపుచున్నవాఁడ నియ్యవి మీసామర్థ్యమునకుఁ దగినవి కాకపోయినను మీ యెడ నాకుఁగల గౌరవమునకు దృష్టాంతరముగ నుండఁగలవనుటకు మీకెట్టి యాటంకము లేదనుకొని నేనుపంపు పద్యరత్నోపహారమును గైకొని నన్నుఁబ్రేమింపఁగలరని విశ్వసించుచున్నవాఁడ" నని యున్నది. అక్కారణమున-

గీ॥ తనపైఁగల యాంక్షల విని
వినయమ్మునఁ దొలఁగఁ ద్రోచి విబుధస్తుత్యుం
డనఁదగి యుండు నతం డిఁక
ననుచు మహోత్సాహ మందె నాతఁ డెడందన్.

వ॥ ఇఁక సూర్యకేంద్రసిద్ధాంతమును నిర్భయముగా లోకమునకు వెల్లడి సేయవచ్చునని సర్వజన వేద్యముగుభాషలో భూ సూర్య

కేంద్రసిద్ధాంతచర్చను జక్కఁగా వ్రాసిప్రచురింప సంకల్పించె. దానితో నాఱిపోయినదనుకొనిన సనాతనవాదుల క్రోధాగ్ని మరలఁదీవ్రముగఁ బ్రజ్వలించునని యాతఁ డెఱుఁగఁడు. ఆహా! సత్యాన్వేషణ పరుల మనస్సెంత దృఢసంకల్పము గలది. అతఁ డెన్ని కష్టములుపడియైనను ప్రకృతిని బరిశోధించి తా గ్రహించిన సత్యమును మానవలోకమున కెఱుకపఱిచి తద్ద్వారమున భూలోకసౌఖ్యసాధమునకు మార్గమేర్పరుపవలయుననియే యా విజ్ఞానశిఖామణి కోరిక.

సీ॥ పొలుపారఖండించె భూకేంద్ర సిద్ధాంత
మొకసభ టాలమీ యోడిపోవ
సందేహమున్నచోఁ జయ్యనఁజనుదెంచి
నా యంత్రమునఁజూచి నమ్ముఁడనుచు
మూఢవిశ్వాస నిర్మూలనారంభుఁడై
సంవాదరూపాన సరసరీతిఁ
గోర్కమైటాలమీ కోపర్నికసుల సి
ద్ధాంతముల్ దెలుపు గ్రంథమును వ్రాయ.

గీ॥ వృద్ధ పండితులాగ్రహా విష్టులగుచు
నందువ్యంగ్యంబుగా మిమ్మె యతఁడు దిట్టె
ననుచుఁ బీఠాధిపతితోడ వాదిరపుడు
కొనకుఁగనివేక మసిపూసి కొన్నయట్లు.

గీ॥ మీ నిషేధాజ్ఞలెల్లను మీఱియిట్లు
నాత్మసిద్ధాంతముఁ బ్రజకు నూఱిపోయఁ
బొత్తమును వ్రాసినాఁడది పొలదనుచు
మందలింపక యుండుట మనకు హాని.

గీ॥ అతని దుర్బోధలన్నియు నాత్మనంటి
మనజనులునమ్మ క్రైస్తవ మతమెమిగుల
దెబ్బదిని పోవుననివారు తెలిపినంతఁ
గోపమేరూపుఁ దాల్చెనా పోపువెలిఁగ.

గీ॥ మేము చెప్పుటయేగాదు మీరుచదివి
చూడుఁడవగతమగు మీకుఁ గూడనిప్పు
డనఁగఁ బతిమించి యుగ్రుఁడై యాక్షణంబ
యతని పాత్రము మీఁదఁదా నాంకవెట్టె.

వ॥ అట్లాంక వెట్టుటయేగాక తత్క్షణంబ నిజసన్నిధానమునకు రమ్మని యర్బనాజ్ఞాపత్రిమంపె. డెబ్బది సంవత్సరముల యీడుగల యీ వృద్ధవిజ్ఞాని గెలీలియో తత్పత్రిముఁ దిలకించి మరల కష్టములు ప్రారంభమైనవని తలంచి హృదయమున మిక్కిలి దిగులుపడె. ప్రియమిత్రుఁడని విజ్ఞానాభిలాషియని యనుకొన్న బార్బారినో యివ్విధముగ శాసించునని కలలోనైన నతఁడనుకొనక ధైర్యముతో సూర్యకేంద్రసిద్ధాంత గ్రంథమును బ్రచురించెను. ఆహా! యీశ్వరసంకల్ప మెవ్వఁడెఱుంగును. వయోజ్ఞాన వృద్ధుఁడగు గెలీలియో హృదయవిదారక ఘట్టముల జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు నమిత భీతితో రోమునగరమునకు వెళ్ళినంత.

గీ॥ తోఁకఁద్రొక్కిన తాఁచునాఁ దోఁచి పోపు
పట్టితెఁడు గెలీలియో భటులు మీర
లనిన నవ్వారు మిన్నుమట్టి యరిగి యతని
తెచ్చిరునురుమ జముబంట్లు తెచ్చినట్లు.

కం॥ తెచ్చినఁ గని పిడిబాకున
గుచ్చినయటు మాటలాడు క్రోధిమతగురుల్
ముచ్చెమటఁ గ్రమ్మఁ గనుతఱి
నిచ్చం బూర్నో విచిత్ర దృశ్యము దోఁపన్.

కం॥ మతమౌఢ్య మెంతదారుణ
గతిఁ గూర్చునొ యంచు దుఃఖకంధి న్మునిఁగెన్
మతిమంతుఁ డతఁడు సత్య
వ్రతుని బరీక్షించునేమొ భగవంతుండున్.

వ॥ అంతఁ బోపతనికిం దొలుదొల్త నే కాంత వాసశిక్ష విధింపనట్లు మాసద్వయంబు గడచె. అనంతరం బతని మతద్రోహ కృత్యములు విచారింప నారంభించి గెలీలియో వాక్యములఁ బెడచెవిం బెట్టుచు "టాలెమీసిద్ధాంతములే నిత్యసత్యములనియుఁ గోపర్నికస్ సిద్ధాంత మసత్యమనియు ముమ్మాటికి సమ్మతించి యిఁకసూర్య కేంద్ర సిద్ధాంతాదుల నెన్నటికిం బ్రచారముసేయనని ప్రతిజ్ఞా వాక్యములు పలుకునంతవఱకుఁ దన్మతాధికారులాతనిని బహు విధముల బాధించిరి. ఆవిజ్ఞానిశిఖామణిని వస్త్రహీనునిజేసి యెఱ్ఱగాఁగాల్చిన యినుపకడ్డీల నెట్టయెదుటఁజూపుచు నీదేహము నిండ వాతల పెట్టుదుమనియుఁ, గరచరణములుగట్టివైచి మహో జ్జ్వలముగ మండుచున్న పెద్దచితిచెంతకుందీసికొనిపోయి యందుఁ బడవైచెదమనియు భయపెట్టిరి. అసభ్యముగ ననూహ్యముగనతి క్రూరముగ నిరవధికముగ సాగుచున్న తద్విచారణపద్ధతులనతఁ డోర్చుకొనలేక లోలోనం గుమిలిపోవుచుండె. విశ్వాసపాత్రుఁడు ప్రాణమిత్రుఁడు విజ్ఞానశాస్త్రప్రియుడు నూతనముగఁ బోపు పీఠమెక్కినవాఁడునగు నర్బన్ సనాతనవాదులెన్ని తంత్రములు పన్ని తనపై నేరములెన్ని చెప్పినను వినఁడు తనకపకారము చేయఁడని నమ్మియున్నవాఁడగుటచేఁ దారచించిన గ్రంథముఁ బ్రచారము చేయఁగలిగెను. కాని యిప్పు డతఁడు దాక్షిణ్య శూన్యుఁడై విన్నన్ని చెప్పినదే వేదమనుకొని చూపుచున్నకాఠి న్యమునకు నివ్వెఱపడి నిత్యప్రాణభీతితోఁ గ్రుంగికృశించిపోవు చుండె. ఆవిచారణ సమయములందు వారొనరించు హత్యా సూచకములగు నయ్యమానుషకృత్యముల కామృదుల హృద యుఁ డెడనెడ క్షమాదేవతను వేఁడుకొనుచున్నాఁడో యనునట్లు మూర్ఛపోవుచు నెట్టెట్టొ తెప్పరిల్లుచుండెను. అత్తఱి నతండు నిజచిత్తంబున నిట్లు యోచింపందొడంగె.

ఉ॥ ఎంతకులేరువీరు నిజమేటికి నేఁటికి దేహరక్షణం
బింతకు సర్వధర్మముల కెంతయు మూలము ప్రాణమున్న నిం
కెంతటి క్రొత్తసంగతుల నేఁ గనుగొందునొయంచు యాత్మలోఁ
జింతిలి తప్పుకోఁదలఁచి చెప్పె మతాధిపుతోడ నీక్రియన్.

చం॥ తెలియమి నొచ్చుకోకు మతి తెల్పితి భూభ్రమణంబు కల్లగాఁ
దలఁపక యుంటకుఁ బల్కు నది తథ్యము తద్వ్యతిరేకు లెవ్వరేఁ
గలిగినఁ బట్టిచూతు మతగౌరవబుద్ధి భవద్వచోవిధిన్
దొలఁగ లిఖించి యిత్తునని తొందరగా నటు వ్రాసియాయఁగన్.
(ద్వ్యర్థి)

కం॥ ఆ పత్రము ప్రతికక్షుల
కాప మ్మొకకొంత మాన్ప దానిఁ బురిపురిం
జూపుచు సభలం జదువుచు
నాపక విద్యాలయముల కరుగుచు పెలుచన్-

గీ॥ తనదు మార్గములన్నియుఁ దప్పటంచు
సమ్మతించె గెలీలియో చదువుఁ డిద్ది
యతఁడు వ్రాసిన పత్రమంచాడి ప్రజల
కతనిపై రోతపుట్టింప మతిఁ దలఁచిరి.

గీ॥ అతని గ్రామము ఫ్లారెన్సు కరిగి వాని
మిత్రతతిఁ జేర్చి చర్చిలోఁ బత్రిమెల్లఁ
జదివి వినిపించి రంతట కుదుటపడక
వృద్ధపండితు లెల్లరు శ్రద్ధఁ బూని.

## కారాగార శిక్ష

గీ॥ పోపువాధ్వర్యమున సభ పొసఁగఁజేసి
యతఁడు లొంగినమాత్రానఁ గుతుకమొంది
విడువరాదని యెల్లరు నుడువ కతన
వేగఁ జెఱఁబెట్టి రాతని వృద్ధుఁ డనక.

వ॥ గెలీలియో యొనర్చిన మతద్రోహమున కాతఁడు ప్రతీందువాస రమునఁ జర్చికరిగి శిరమ్ము భూమికంటవాల్చి భగవంతుని వేూ్రల మతసూక్తుల నేడింటి నుచ్చరింపవలయునని శాసించుచు నతని కాజన్మకారాగారవాస శిక్ష విధించిరి. అమ్మహావిజ్ఞాని ప్రతి భట్టారకవారంబునఁ జర్చికేఁజనిమతసూక్తులఁ బఠించి చిట్టచివఱ "నయిననది భ్రమించుచునేయున్న" దని భూమిని దనపాదంబు

నందన్ని పల్కుచుండెడివాఁడని ప్రతీతి. ఇట్లు రెండు శరత్తులు కడచెను.

గీ॥ అట్టుబంధింపఁ గృశియించు నవసరమున
నిండుజబ్బునఁ దన కూతుడుండి నరగఁ
తన్నెపుడు స్వాత్మనాయకుఁ డన్న దమచు
బరమహితుఁ డెవ్వఁడో యొక వార్తదెచ్చె.

గీ॥ నిజబహిఃప్రాణమై జ్ఞాననిష్ఠధీరు
రాలయు మతప్రచారకురాలయి యశ
మందుచున్నట్టి మేరియా యంత్యదశను
నాతికితపింగ గుండెయు లవిసిపోయె.

గీ॥ ఒంటరిగరావు కష్టము లింట బయట
యనెడి యుక్తికి దృష్టాంత మయ్యెనద్ది
యౌర! వినుటకె కష్టమౌ నట్టిస్థితు ల
ననుభవించెడి వాఁ డెట్టు లడలునొ గద.

గీ॥ ఇట్టిదుస్థితి పోవునకెఱుక పఱచి
యామెతఁ జూడకోరినదనుచుఁ దెలిపి
వేగవెడలుట కనుమతి వేఁడు కొనఁగఁ
గొంత యోచించి యాతఁడు గోపముడిగి.

కం॥ అయమ మతప్రచారము
సేయుటలో నగ్రగణ్య జీవితమెల్లన్
న్యాయము దప్పక మెలఁగుట
నాయంతిమ వాంఛ దీర్ప నాజ్ఞనొసంగెన్.

ఆ॥వె॥ ఏపఁ జోడ నెప్పుడేమి మాటాడిన
గతి నశిక్ష చేయఁగఁబుగు ననిన
నతని యానకొగ్గి యార్కెట్రికిం జని
తన తనూజచెంతఁ దానునిలిచె.

గీ॥ తనస్థితికిఁ జింతయట్లుండఁ దనదుకూఁతు
నొద్దకేఁగఁగ నొండొరుఁ జూచుకొనుచు
సుతగతికిఁ దండ్రిజనకుని గతికిసుతయు
నెంత దుఃఖించిరో యదియెవరి కెఱుక.

వ॥ ఇట్లు శోకవ్యాకులిత హృదయులైయుండ మేరియా మరణించె.

మ॥ తన మేలుంగను పుత్రికంటి యెదుటందన్వాసి పోఁజూచియా
తనిహృద్గోళముఁ గ్రమ్మెఁ జీఁకటులు నేత్రప్రావృడ భ్రంబులున్
ఘనధారా మిళితంబులయ్యె జనసంకాశంబు చూపోపమిం
దనుదానే కననేరఁడయ్యెనకటా! ధైర్యార్క బింబచ్యుతిన్.

శా॥ సత్యాన్వేషణ నిత్యకృత్యముగ దీక్షంబూని నిస్స్వార్థతం
బ్రత్యక్షం బొనరించి రేవగలు సేవల్సేయు నన్నిట్లియో
యత్యాచారులచేతి డోలకముగా నాడించెదే దేవ! యీ
వాత్యన్ భృత్యుఁడు నిల్వలేఁడనుచుఁ దావపోవు లోలోఁ గడున్

కం॥ ఈ రీతి దుహితృశో కాం
గారాగారమున హృదయ కమలము కమలం
జేరెద స్వగాత్రిమంబని
కోరఁగఁ జెఱనుంచి పోపు కోపంబడరన్.

ఉ॥ వాకొననేల నీవిటుల వాగుచునుండెద వేనిరోములోఁ
జీఁకటి కొట్టునందు నినుఁజేర్తుమనన్ వెసనూర్చి దైవపుం
డాకను డీకొనంగల గుణంబొకటున్నదెయంచు నిల్చెన
స్తోకవికాస హీనుఁడయి యాతఁడు బోనునఁ గేసరింబలెన్.

ఉ॥ 'నా' యనువారులేక భవనంబుననుంటకు విలులేకయే
న్యాయము పల్కలేక వినునట్టి మహాత్ములులేక యయ్యయో
కూయిడు చున్నయట్టి బుధకుంజరుఁ బంజరమందుఁ బక్షిగాఁ
జేసుటివేటి ధర్మమని చెప్పదులోకమదెంత క్రూరమో.

చ॥ శిరమున బుట్టటోపి. కటి సీమనువాలుఖడ్గాలుఁ జొక్కాలఁ
బిరుదుల వాక్రితమేల్మినును బిళ్ళలు వెల్గఁగఁ బొత్తుటీఁగయేఁ
జొఅనట వీలులేనటు త్రిశూద్దిగ నిల్తురు ద్వారపాలకుల్
కరమున బారుటీ వెలుఁగన్ యమకింకరులట్లు విశ్వవిలువన్.

గీ॥ అవ్విధంబున వర్షత్రయంమ్ము తనఁగ
గగన వీక్షణముననో దుఃఖభరమునవో
బిట్టుగా నేత్రములు మంట పుట్టిపుట్టి
కడకునంధత్వ మొదవెఁ దద్ధనున కపుడ.

కం॥ అంధత్వం బేర్పడని
ర్బంధము సహించి రతని బాధలకు జగ
ద్బంధుం డాశ్రిత కరుణా
కంథి పరాత్పరుఁడు వానిఁగాచె ననంగన్.

వ॥ అట్లు సడలించుచేఁగాక యాతని జన్మస్థలమైన ఫ్లోరెన్సు నగరమున కరుగుట కనుమతి నిచ్చిరి. అంతియకాక మతాధికారుల యానవడసి తన్మిత్రులుగాని, తచ్ఛిష్యులుగాని గెలీలియోకుఁబరిచర్యలు సేయవచ్చుననిరి. ఈ వార్త దుత్రిగతి పాశ్చాత్య ఖండముల వ్యాపించె.

మ॥ తనయాశోక దవాగ్ని క్రమ్ముచు మహాదైన్యాహతిం గ్రుంగ నా
తని యారోగ్య విఘాత మేర్పడఁగనంధత్వంబు సేకూరఁగా
విని సెల్లీమొదలైన శిష్యతతి వే వేంచేసి సేవింపఁ జెం
తన నిల్చెన్ బహుభక్తి రక్తి విధి తానార్వాసి నీర్వోయఁడే!

మ॥ అతి శాంతుడగు సద్గురూత్తముని ప్రత్యక్షంబునం దెన్నియో
నతు లర్పించి వెసంబరోక్షమున నిందావాక్యముల్ వల్కు దు
ర్మతులా శిష్యులు, కారు, చీడపురుగుల్ మాన్యుండు సెల్లీమహా
స్తుతి పాత్రుంబగు కల్పమై ఫలములిచ్చున్ దేశికుల్ మెచ్చఁగన్

వ॥ గెలీలియో భరింపరాని కష్టములందుండియే గతినియమముల నన్వేషించెను. సెల్లీ ప్రభృత్యంతేవాసి బృందసహాకారంబు కల్మినతఁడు గొంతసంతసించె. సత్యాన్వేషణాత్త ఫలితములు

ప్రోత్సాహజనకములుగ నున్నను మతరాజకీయ వాతావరణము తనకనుకూలముగ లేకపోవుట నమ్మహామహుఁడు పడిన కష్టములు వర్ణించుట కలవిగానివని వేఱుగఁజెప్ప నక్కఱలేదు.

## మిల్టన్ - గెలీలియోల సంభాషణ

ఉ॥ అమ్మహనీయుదేహ మొక యానకు లోనుగ నంధకార బం
ధమ్మునఁ జిక్కి స్రుక్కినటు తారొనరింతురుగాక భావి లో
కమ్ముఁ దదీయకీర్తి రవికాంతులు వెల్లుగ దిగ్దిగంతముల్
గ్రమ్మిననాఁడు వారల ముఖమ్ములు చీఁకటిఁ జిమ్ముచుండవే?

ఉ॥ ఎంత దయావిహీనులరెరే యిటువంటి మహాత్ముఁబట్టి బా
ధింతురు శాస్త్రచర్చల వధింతురు విశ్వరహస్య దృష్టి మా
యింతురు మా మతాధిపతులేమి విచిత్ర మటంచు నాత్మలోఁ
జింతిలి నాఁటి యాంగ్లకవి సింహము మిల్టను చూడవచ్చినన్.

గీ॥ మిల్టను మహా కవీంద్రుడు మిమ్ముఁజూడ
వచ్చినాఁడని శిష్యుఁడు వాకొనంగ
నమిత సంతోష దుఃఖహాసాశ్రు లొదవ
గాధిజుఁడు శుకునింబలెఁ గౌఁగిలించి.

మ॥ ఇలలో స్వర్గము స్వర్గమందిలను నీవేకావె సృష్టించి మా
కల కల్యాణ కళాప్రపంచముగ సాక్షాదక్షరాకారతన్
వెలయింపంగల పుణ్యమూర్తివి యిటన్ నిల్వంగ వీక్షించు ని
స్తుల సౌభాగ్యములేదు పాపియెటులొందున్ దేవతాభోగముల్.

మ॥ ఇసుమంతేనియు స్వార్థమున్నయెడ రానేలా ననుంజూడ నే
వసురాడ్గేహమొ చొచ్చి యిచ్చకము సంభాషించి వాఁడుద్ధతిన్
రసనాగ్రంబునఁ బుక్కి తేనెపలుకుల్ రక్షించునంచెంచి నీ
రసవాక్యంబులఁ బ్రొద్దుపుచ్చక కవీంద్రా! జ్ఞానరత్నాకరా!

శా॥ ఏ నే దుష్కృతి చేసినందులకు నాకీశిక్ష చేకూర్చెనో
జ్ఞానీ! నీవ యెఱుంగుదేని చెప్పుమా కైవల్యముం గూర్పుమా
యీ నేత్రమ్ములు లేనివానికి జగంబేలేదు జీవించినన్
నావాఁటం గృశియించు మూఁతగలతుండన్ దివ్యచందంబుగన్.

మ॥ సుకమా? సత్కవిచంద్రి! నీదు రచనాజ్యోత్స్నాప్రసారంబునన్
సుకమీలోకముపొందు నెత్తెఱఁగు దీర్చున్ నీఋణంబింత మా
మక దైన్యస్థితిఁ జూడవచ్చితె; జగన్మర్మజ్ఞ! యీలోకమం
దకటా! మంచికి మంచిలేదనుచు దుఃఖాంభోధిలో మున్గుచున్.

కం॥ అఱమోడ్చిన కందోయిం
దొఱఁగెడి బాష్పములతోడఁ దొనకకయుండన్
గరుణారసహృదయుఁడు కవి
శిరమూపుచు నాత్మనిట్లు చింతిలఁ దొడఁగెన్.

ఆ॥వె॥ ఇంతధైర్యశాలి నింతవిజ్ఞానిని
ఇంతకష్టజీవి నింతసుగుణి
నింతదీర్ఘదర్శి నింతవర్చస్విని
నిట్లుచేసె దైవమేమి కతమొ!



గీ॥ వ్రేలు వంకరగాఁబెట్టి వెన్నుఁదీయు
వానిదశవెల్గ విశ్వకల్యాణకారి
ధన్యుఁడిట్లయ్యె దైవము దప్పుఁజూడఁ
బూరిమేరువు మేరువుపూరి గాదె.

ఆ॥వె॥ స్వానుభవముతోడ సానుభూతినిదెల్పు
నాప్తుఁడెదుటనున్న నాత్మలోన
నణఁగియున్నయట్టి యానందదుఃఖముల్
హెచ్చి వేగ వెలికివచ్చు టరుదె.

కం॥ దివిభువి సంధింపంగల
నవవిధి చెఱసాలఁ జాల నవసె ననుచుఁ గ
న్గవ నీరుగార్చు జలజల
కవిహృదయము వెన్నకన్నఁ గడు మృదువుగదా!

గీ॥ మీరు విడిచిన కన్నీరు మీ పటాలఁ
బొంకముగ భావిలోక మలరింప
నాణిముత్యాలపేరులై యలరు ననుచు
బలుకుచున్నది శాఁబోలుఁ బ్రకృతిమాత.

కం॥ గంభీర హృదయులగు వా
రంభోధి తెలియఁగు సర్వ మణచికొనుచు లో
సంభాషణ మాపిరి క్షణ
మంభోనిధి శబ్దశూన్యమై నట్లంతఁ.

మ॥ అనఘా! యేటికివంతనొందెదవు దైవాజ్ఞన్విరోధింపఁగా
మనచే నౌనె? యఘౌఘరూపము కృతఘ్నానీకముం గాంచ వ
ద్దని నిన్నిట్టులు చేసెనేమొ విధి లేదా నిత్యసూక్ష్మాంశ శో
ధనచే దృష్టివిఘాత మేర్పడెనొ సత్యంబీశ్వరాయత్తమౌ.

ఉ॥ స్వార్థ పరార్థజీవుల యథార్థ వివేకవిదగ్ధిలేక ప్ర
త్యర్థి హితార్థిగాఁ దలఁచి యంధునిరీతిఁ జరింలోక మీ
యర్థమెఱింగి సత్యమున కాదరువై జయమందు మీవిలా
సార్థులు మీమహోజ్జ్వల కలాత్మకశక్తి నెఱుంగ నేర్తురే.

గీ॥ వస్తుమణిభూషణాదు లావలకుఁ ద్రోసి
యంధకార మాలిన్య దేహంబురోసి
నీప్రయోగశాలాబాల నిమ్నఁబాసి
యెంత చింతించుచున్నదో యెవరి కెఱుక.

ఉ॥ ఐనను సత్యమెన్నటికి నాఁగదు దాఁగదు వీఁగదేగదీ
మానవకోటి నోటఁబడి మాకును మీకును ధ్యేయమొక్కఁడే
గానవచింతు నింతయుఁకఁ గాలము గాలముగాఁ దలంచియా
దీన జనావనుండయిన దేవుని భావనయందు నిల్పుమా.

శా॥ వాసింగూర్చెడి గ్రంథపేటి నిజభావ ప్రోజ్జ్వలద్వ్రజముల్
రాసుల్పోసి యొసంగుమా భువన కల్యాణంబు చేకూర్పుమా
యీ సేవాఫలితమ్ము వ్యర్థమయి పోదీలోకమందెప్పుడుఁ
నీసూత్రంబులు బహ్మసూత్రములుగా నిల్చున్ నిజంబింతయున్

గీ॥ అసమభార వస్తుద్వయ మ్మొకసమ్ము
నుండివిడిచిన నవిరెండు నొక్కపారి
యిలఁబడుటఁజూప గోపురమెక్కి యట్టి
గుండ్లువిడిచి జయించిన కోవిదుడవు.

కం॥ అని యనితర సౌజన్యత
మనసును మనము పెనఁగొనంగ మసలింగ మిల్టన్
దన కరచాలన పూర్వక
వినయ మెసఁగ సెలవటంచు వీడ్కొనె నతనిన్.

కం॥ పదముల పదార్థముల సం
పద నాత్మతనూవికాస బంధురసృష్టి
ప్రదులగు నిర్వ్యర వీడ్కో
లదియొక రసరాట్స్వరూపమై రాజిల్లెన్.

కం॥ ఏతత్కవి నుడి హితమని
భౌతికవిజ్ఞానమందుఁ బ్రముఖస్థాన
ఖ్యాతియుతగతి నియమవిధు
లాతఁడు పాత్రముగ వ్రాసి యరిగెన్ దివికిన్.

వ॥ మతైక దృష్టితోఁ దధికృతులు

గీ॥ అతని భౌతిక తనువు మతాంగణమునఁ
బూడ్చిపెట్టరాదని పగఁబూని తోన
శాసన మొకండు చేసిరి సత్వరగతి
దానఁ దన్నామ మిఁకఁ బ్రజలు తలఁపరనుచు.

కం॥ గతినియమ సూత్రసృష్టికి
మతిమంతుఁ డితఁడె బ్రహ్మ మానవలోకం
బతనికి ఋణపడియున్నది
సతతం బిది నమ్మఁదగును సాధూత్తంసుల్.

కం॥ మనుజుని బంధించినఁ ద
న్మనసును బంధింపలేరు మనుజాధిపులున్
ఘనుఁ డినుఁగప్పిన మనకుం
గనపడ కటఁ దనకుఁ దాఁ బ్రకాశించుఁ గదా.

కం॥ భౌతికశాస్త్ర రహస్యము
జ్యోతిశ్శాస్త్రమును దెలిసి శోధించుటచే
నాతని సూత్ర జ్ఞాన [illegible]
జ్యోతిం గని జగతియెల్ల జోహరు లనెన్.

వ॥ అతఁడు స్వర్గస్థుఁడైన పిదపఁ గొందఱు బుద్ధిమంతు లాతని జ్ఞాన పరిశ్రమమునకు ముగ్ధులై యమ్మహామహుని శిలావిగ్రహంబుఁ బ్రతిష్ఠింపఁ దలంచిరి.

గీ॥ కాని కసిదీఱక మతాధికారు లప్పు
డాగ్రహంబునఁ దచ్ఛిలావిగ్రహంబు
నటఁ బ్రతిష్ఠింప వీలులేదనిరి దాన
నతని కీరితి నశియించు ననుచుఁ దలఁచి.

గీ॥ అతఁడు లోకమ్మునకుఁ జేసినట్టి సేవ
ఘనులు గుర్తింపఁ బ్రజ భావికాలమందు
నఖిల విజ్ఞానకేంద్రాల నతని పటము
లుంచి పూజింతురని వార లెంచరైరి,

గీ॥ అతని విజ్ఞానదీపిక యాఱిపోయె
ననుచుఁ బీతాధిపతి ముదమందువేళ
నవతరించె నొకండు స్నేహంబు పెంచి
దశను బొడిగించి తేజన్నిదిశల కొసఁగ.

వ॥ అతఁడే న్యూటను.

## గద్యము



ఇది శ్రీమద్గౌరీశంకర వరప్రసాద లబ్ధ సహజ
చతుర్విధ కవితా కలా విలాస సాహితీ రసవికాస
సంస్కృతాంధ్రాది బహుభాషా గభీరమనోహర
భావ బంధురమహోల్లాసభాస బండ్ల పిచ్చమ్మా
పిచ్చయార్యాత్మజ పౌత్రి యాదమ్మా
వేంకటసుబ్బయార్య జ్యేష్ఠపుత్రి
యన్నపూర్ణా సావిత్రి కళత్రి
సుహృజ్జన సువిధేయ
సుబ్రహ్మణ్యనామధేయప్రణీతమైన
గెలీలియో చరిత్రము
సంపూర్ణము

# ఏతత్కృతికర్తృ రచనలు

1. ప్రహ్లాద — నాటకము
2 కుమార విజయము ,,
3. బుద్ధావతారము ,,
4. తులసీదాసు ,,
5. వేమన ( 1000 పద్యములు ) పద్యకావ్యము
6. కళాశ్రీ (ప్రథమ భాగము) ,,
7. ఆంధ్రమహాభ్యుదయము ,,
8. కన్యకాపరమేశ్వరీ చరిత్ర ,,

( అచ్చులో నున్నవి )

9. బుద్ధ చరిత్ర — బుఱ్ఱకథ
10. న్యూటన్ — పద్యకావ్యము
11. మైకేల్ ఫేరడె ,,
12. మయసభ — ఏకపాత్రాభినయము
13. కళాశ్రీ — ద్వితీయ తృతీయ భాగములు
14. రుక్మిణీ కల్యాణము
15. వేదవతి — బంధప్రబంధము
16. రామాయణము — బంధప్రబంధము
17 దురాక్రమణ — బుఱ్ఱకథ
18. పరితప్త దుర్యోధనుఁడు — ఏకపాత్రాభినయము
19. జగదీశచంద్రబోసు — పద్యకావ్యము
20. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము — నాటిక



ప్రతులకు:

**మహాకవి జంధ్ల సుబ్రహ్మణ్యము**

వేటపాలెము (S. C. Rly.)

బాపట్ల తాలూకా — గుంటూరుజిల్లా.